శ్రీ

# శ్రీనివాసశతకము



గ్రంథకర్త:

నారాయణం రామానుజాచార్యులు

VICTORY PRESS, REPALLE.

# ప్రకటన

నాచేరచింపఁబడి ముద్రణమునకు సిద్ధముగనున్న గ్రంథములు.

"సుచంద్ర" (నాటకము) ఇందలియితివృత్తము విచిత్రమైనది.
శృంగార రసరంజితము.

"వీర బభ్రువాహన" (నాటకము) భారతకథ,
వీరరసాలంకృతము.

"క్షీరాబ్ధికుమారీ శతకము"

నారాయణం రామానుజాచార్యులు,
ఉల్లిపాలెం (రేపల్లెతాలూకా)

శ్రీరస్తు

శ్రీ

# శ్రీనివాస శతకము

గ్రంథకర్త:


శ్రీ. ఉ. ప్ర. శ్రీమాన్

నారాయణం రామానుజాచార్యులు,

ఉల్లిపాలెం. ( రేపల్లె తాలూకా. )


---


ఇయ్యది

రేపల్లె విక్టరీ ముద్రాక్షరశాలయందు ముద్రితమై

గ్రంథకర్తచేఁ బ్రకటింపఁబడినది.

ప్రథమ ముద్రణము 500 ప్రతులు.





[ వెల రు 0-12-0 లు.

30-9-1946

శ్లో॥ గుణదోషౌబుధోగృహ్ణన్నిందుక్ష్వేళావివేశ్వరః ।
శిరసాశ్లాఘతేపూర్వంపరంకణ్ఠేనియచ్ఛతి ॥

శ్లో॥ సహజాన్ధదృశస్స్వదుర్ణయే
పరదోషేక్షణదివ్యచక్షుషః
స్వగుణోచ్చగిరోమునివ్రతాః
పరవర్ణగ్రహణేష్వసాధవః ॥

☞ చదువరులు తప్పొప్పులపట్టికలోని సవరణములను గ్రంథమందుఁ
జేర్చుకొనం బ్రార్థితులు.

# విన్నపము

ఈ శతకమునందుఁగల కవిత్వ దోషములం బరిత్యజించి గుణ లేశములనే స్వీకరించుటకై విద్వత్కవీంద్రమండలము మాటిమాటికి నభ్యర్థింపఁబడుచున్నది.

మఱియు, ధర్మకార్యము లన్నమాత్రముననే ద్రవ్య దాతుల కైనను బహుళముగా వెనుకంజ వేయుటయే ముఖ్య కర్తవ్యమని యుపదేశించుచున్న వర్తమానకాలమునుంగూడ దృణీకరించి, తమయౌదార్యాది సకలసద్గుణసముదాయమున కాదర్శముగ, నేతద్గ్రంథ ముద్రణమునకై తగిన విరాళముల నొసంగి, నన్నుఁ బ్రోత్సహించి నట్టియు, శ్రీమద్భగవద్భాగవత కైంకర్య నిష్ఠ స్వాంతులై నట్టియు, నాకత్యంత ప్రియమిత్రు లైనట్టియు బ్రహ్మశ్రీ పాలపర్తి రామయ్యగారికిని, శ్రీయుత వల్లభనేని కుటుంబరామయ్యగారికిని, శ్రీయుత సబ్బినేని చినవీరయ్యగారికిని, శ్రీయుత వల్లభనేని పురంధరామయ్యగారికిని శ్రీమదఖిలాండకోటి బ్రహ్మాండనాయకుండై, శేషాచల శిఖరోపరిభాగమున వేంచేసియున్న శ్రీ శ్రీనివాస భగవానుఁ డవిచ్ఛిన్నైశ్వర్యాయురారోగ్య పుత్ర పౌత్రాది నానావిధోప భోగ్యాభివృద్ధులం బ్రసాదించి రక్షించుచుండుగాక, యిట్టి మహోపకార మొనర్చిన ద్రవ్యదాతలయెడ నేను సదా కృతజ్ఞుఁడనని యును ఇందుమూలముగా విన్నవించుకొనుచున్నాఁడను.

వ్యయనామ సం॥ర విజయదశమి,
స్థిరవారము, 5-10-46.
ఉల్లిపాలెం. (రేపల్లె తాలూకా)

ఇట్లు
గ్రంథకర్త,
నారాయణం రామానుజాచార్యులు.

శ్రీరస్తు.

# శ్రీ శ్రీనివాసశతక

## ముద్రణద్రవ్యదాతల శుభనామములు

(రేపల్లె తాలూకా సజ్జావారిపాలెం కాపు
రస్తులు) శ్రీయుత వల్లభనేని పున్నయ్యగారి
కుమారుడు కుటుంబరామయ్యగారు రు 150—0—0

(రేపల్లె తాలూకా ఉల్లిపాలెం కాపురస్తులు)
శ్రీయుత సబ్బినేని పిచ్చయ్యగారికుమారుడు
చినవీరయ్యగారు రు 100—0—0

(రేపల్లె తాలూకా సజ్జావారిపాలెం కాపు
రస్తులు) శ్రీయుత వల్లభనేని పెదఅచ్చయ్య
గారి కుమారుడు పరంధరామయ్యగారు రు 40—0—0

(డిటోగ్రామ కాపురస్తులు) బ్రహ్మశ్రీ వేద
మూర్తులయిన పాలపర్తి రామయ్యగారు రు 10—0—0

మొత్తము (మూడువందల రూప్యములు) రు 300—0—0

శ్రీనివాస శతకమునుగూర్చి

# పండితాభిప్రాయములు.

---

గుంటూరుజిల్లా, పొన్నూరు దేవస్థానం సంస్కృత కళాశాలా పండితులును, శతావధానులును, చతుర్విధ కవితాధురీణులును, శ్రీరామదాసచరిత్రాద్యనేక దివ్యాంధ్ర ప్రబంధ నిర్మాణకర్తలును అగు బ్రహ్మశ్రీ వేదమూర్తులైన చల్లా పిచ్చయ్యశాస్త్రిలవారి యభిప్రాయము.

---

శ్రీ శ్రీనివాస పరబ్రహ్మణేనమః

సీ॥ శ్రీశైలిమధురత, ♦ వృత్తికల్పన, శయ్య,
యుత్పత్తి, శక్తి మ ♦ హోదయంబు
భావం, బలంకృతి, ♦ పాక, మౌచితి, రస
పారవశ్యతయును ♦ బరఁగవిల్లు
నీకైతపదపూజ ♦ నీరజలక్ష్మియై
యుద్యానమునఁ దూఁగు ♦ టూయెలయయి
గళమునహారమై ♦ కయిఁదళ్కుటద్దమై
కన్దామరలఁబచ్చ ♦ కప్పురమయి
తే॥ గీ॥ శ్రీనివాసుని సతము రం ♦ జింపఁజేయుఁ
గాఁత సత్సంతతి శ్రీసు ♦ ఖంబుపొంటె
ధీర! "నారాయణా"న్వయ ♦ దీప! మధుర
వచన! "రామానుజాచార్య" ♦ వల్గురచన.

దేవస్థానం,సంస్కృత
పాఠశాల,పొన్నూరు.
9—12—1945

ఇట్లు,
చల్లా పిచ్చయ్యశాస్త్రి,
శతావధాని.

గుంటూరుజిల్లా, రేపల్లెపుర నివాసులును, విద్వాన్, ప్రౌఢకవి, మధురకవీత్యాది బిరుదాంకితులును, శ్రీమదఖండిత మహాలక్ష్మీప్రసన్నులైన శ్రీ శ్రీ శ్రీ ఉత్తరవల్లూరు రాజావారి సంస్థాన పండితులును, అష్టావధానులును, శ్రీకృష్ణతులా భారాద్యనేకాంధ్ర గ్రంథకర్తలును, శ్రీమదుభయవేదాంత ప్రవర్తకులును అగు శ్రీమాన్ పంచాంగం వేంకట రామానుజాచార్యులవారి యభిప్రాయము.

---

శ్రీ సీతారామచంద్రపరబ్రహ్మణే నమః

సీ॥ గంభీరచతురవా ♦ గ్గుంభనత్వేర్యాది
జృంభణంబులుపోలె ♦ డంబుమీర
నిందాస్తవంబర ♦ వీఁదకుమాఱక
పొలయుల్కులకుఁ గ్రొత్త ♦ పొలుపుఁదెలుప
ప్రౌఢవక్రోక్తుల ♦ వసధరాకామినీ
కిలికించితంబాచు ♦ వలపులొలయ
సరసమాధుర్యప్ర ♦ సాదతారీతులు
దివ్యోపభోగ్యవు ♦ త్తినిరహింప

తే॥ గీ॥ శ్రీనివాసుని నిత్యల ♦ క్ష్మీనివాస
దివ్యసాన్నిధ్యవైభవా ♦ ధికతనాంత
రంగికైకాంతసేవాత ♦ రంగితమయి
శ్రీనివాసాఖ్యశతకంబు ♦ సిరివహించె.

సీ॥ వైఖానసాభిఖ్య ♦ శాఖాల సత్సూత్ర
రేఖాప్రవర్తక ♦ ప్రేమవర్తి!
నారాయణోపాహ్వ ♦ సారాన్వయాబ్ధితు
పారశర్యాన్వయిత ♦ చారుమూర్తి!
బభ్రువాహ, సుచంద్ర, ♦ విభ్రమనాటకా
దభ్రకర్తృత్వాప్త ♦ శుభ్రకీర్తి!
పన్నగాగాధీశ ♦ చన్నకేశవపద్మ
నిలయాభిమతిశత ♦ నిష్ణాతార్తి!
తే॥ గీ॥ సాధువృత్త్యగదంకార ♦ చక్రవర్తి!
కృతకృధాలోభమోహాహ్వై ♦ కృతనివర్తి!
రామదేశిక నరసమాం ♦ బామహాప్ర
తావళిస్ఫూర్తి! రామాను ♦ జార్యమూర్తి!

రేపల్లె,
5—9—1943.

ఇట్లు,
పంచాంగం వేంకటరామానుజాచార్యులు

శ్రీమత్పిఠాపుర మహారాజ సంస్థాన పరిషత్పణ్డితవరేణ్యులును, తర్క-వేదాంత విద్యావిత్యాది బిరుదావళీవిరాజమానులును అగు బ్రహ్మశ్రీ వేదమూర్తులైన వసుమూర్తి సుబ్రహ్మణ్యశాస్త్రిలవారి యభిప్రాయము.

---

శ్రీరస్తు.

శ్రీమద్వేదమార్గేత్యాది ప్రవర్తకులైన శ్రీమా౯ నారాయణం రామానుజాచార్యులవారిచే రచియింపఁబడిన

శ్రీనివాస శతకమును ఆమూలాగ్రముగా వినియున్నాడను. ఇందుకవిగారు శ్రీ శ్రీనివాసుని లీలలను భక్త్యావిష్ట హృదయులై ముచ్చటగా వర్ణించియుండిరి. పోతన, ధూర్జటి ప్రభృతి మహాకవులు రచించిన శతకములనుబట్టిచూడ నాంధ్ర వాఙ్మయములో శతక మొక్కటియే యుత్కృష్టస్థాన మాక్రమించుకొనఁ దగియున్నది. భావోద్రిక్తుఁడయిన కవి స్వీయ భావ సంపద నిందు వ్యక్తపఱుపఁ గల్గును. ఆధునికులలోఁ గొందఱు తమ కవిత్వమునకు శతకముల నెరగాఁ జేసి నైచి విచ్చలవిడి వ్రాసి యెల్లో పద్దెములల్లి, శతకముల విలువను జెడఁగొట్టిరి; కాని, ఇందీకవివరులు తమ యపూర్వ భావ ప్రపంచమును మృదుమధురపదగుంఫితముగా నొనర్చిరి. ద్రాక్షా పాకవిలసితమై, శయ్యాగుణభూషితమై, ధారావాహినియగు నిందలి శైలి కడుంగడు ప్రశంసనీయము. ఇది సమస్త మానవాదరణ పాత్రమై వన్నెకెక్కఁగల దనుటలో సందియమిసుమంతయేనియును లేదు.

పిచ్చికలపాడుఅగ్రహారం,
గన్నవరం తాలూకా
14—9—46.

ఇట్లు,
వసుమర్తి సుబ్రహ్మణ్యశాస్త్రి.



శ్రియై నమః

శ్రీ

శ్రీనివాసపరబ్రహ్మణేనమః

శ్రీమద్విఖనస మహాగురవేనమః

శ్రీ

# శ్రీనివాస శతకము

శ్రీ వనజాలయా ♦ సేవితాంఘ్రి సరోజ
కలిసాధ్వసాక్రాంత ♦ కల్పభూజ
మార్తాండ శతకోటి ♦ మహితదీప్తికలాప
నవనవోన్మీల నా ♦ సుందరూప
శంఖచక్రగదా సి ♦ శార్ఙ్గకీలితహస్త
ఘనరిపుధ్వస్త లో ♦ క ప్రశస్త
నిఖిలవేదాంతైక ♦ నిలయాంతర విహార
రమణీయ కౌస్తుభ ♦ రత్నహార

తే॥ గీ॥ రవిసుధాకరనయన శ్రీ ♦ రాబ్ధిశయన
ప్రథితమునిగేయ మామక ♦ భాగధేయ
మధుమదనిరాస కోటిమ ♦ న్మథవిలాస
శ్రితమనోవాస జయజయ ♦ శ్రీనివాస 1

సీ॥ నారదవీణా ని ♦ నాద సంతతమోద
భస్మీకృతా ఖిల ♦ భక్తఖేద
సురసిప్నగాగరి ♦ శోభితశ్రీపాద
హృతసోమకాధీన ♦ వితతవేద
దత్తదానవసతి ♦ చిత్తదీర్ఘవిషాద
మునిమండలాహ్లాద ♦ ముక్తభేద
సర్వలోకక్షేమ ♦ సర్గభంగవినోద
భవముఖ్యగీర్వాణ ♦ భద్రవాద

తే॥ గీ॥ సజ్జనశ్రీదకృతకల్మ ♦ షప్రమాద
సమయమిదికాద నన్గావ ♦ జాలిలేద
మధుమదనిరాస కోటిమ ♦ న్మథవిలాస
శ్రితమనోవాస జయజయ ♦ శ్రీనివాస 2

సీ॥ అఖిలలోకపవిత్ర ♦ హరినీలమణిగాత్ర
వందారునుతిపాత్ర ♦ వనజనేత్ర
విష్టరశ్రవణ శ్రీ ♦ విష్టపాభరణ ని
ర్దుష్టరక్షణచణా ♦ నిష్టహరణ
కరుణాలవాల శ్రీ ♦ తరుణీవక్షోలోల
శరణార్థిజాల భా ♦ సురకపోల

సత్యవ్రతస్తోమ ♦ నిత్యమంగళధామ
పద్మావతీకామ ♦ భవ్యనామ

తే॥ గీ॥ బహుళసంపన్నిదాన స ♦ ద్భక్త్యధీన
వినతుఁడనుగాన దయఁగనం ♦ బనికిరాన
మధుసూదనవిరావ కోటిసు ♦ న్మథవిలాస
శ్రితమనోవాస జయజయ ♦ శ్రీనివాస

సీ॥ కంబమందెటులుండుఁ ♦ గన్గొందుననికదా
యసురాధిపుం డొక్కఁ ♦ డదటి చెప్ప
నుత్తరాగర్భమం ♦ దుండువాఁడనికదా
గురుకుమారుఁడు శౌర్య ♦ విరతుఁడయ్యె
నిటనున్న పాంచాలి ♦ నెటు గాంచుననికదా
దుశ్శాసనుఁడు తీవి ♦ దొలఁగి చూచె
నలుగుటవనిమాని ♦ తెలియువాఁడనికదా
కురురాజు గుప్పునఁ ♦ గూలఁబడియె

తే॥ గీ॥ తాము వేంచేసియుండని ♦ తావు, తమకుఁ
దెలియరాకట్టి యర్థ మెం ♦ దేని గలదె
మధుసూదనవిరావ కోటిసు ♦ మన్మథవిలాస
శ్రితమనోవాస జయజయ ♦ శ్రీనివాస 4

సీ॥ జననమందినతోడ ♦ జననీజనకులకు
నేకుమారుఁడు తత్వ ♦ మెఱుఁగఁ జెప్పె
వికలమై భువిఁగూల ♦ శకటము నెగఁదన్ని
యేబుడుతఁడు మాత ♦ కేపుఁజూపె

నేడింభకుం డంబ ♦ కీ రేడు జగముల
నుదరంబునం జూపె ♦ సదయుఁడగుచుఁ
గట్టఁదెచ్చిన రజ్జుఁ ♦ గడమువడంజేసి
యేసందనుఁడు తల్లి ♦ కితముఁగూర్చె

తే॥ గీ॥ అట్టి బాలుండవైన ని ♦ న్నంటి తిరుగు
గొల్లపిల్లల సుకృతమే ♦ కోఁడియొకద
మధుసూదనవిలాస కోటిమ ♦ న్మథవిలాస
శ్రితమనోవాస జయజయ ♦ శ్రీనివాస 5

సీ॥ బహుళకృతఘ్నుండైన ♦ భస్మాసురుం ద్రుంచి
కాత్యాయనీనాథుఁ ♦ గాచినావు
భాషాసతిక్రోధ ♦ భారము నడఁచి
లీలతోఁ జతురాస్యు ♦ నేలినావు
పృథుమహీజానికి ♦ బెదరియాక్రందించు
వసుమతిపతిఁ బ్రీతి ♦ మనిచినావు
కుండలంబులకునై ♦ దండిశత్రులఁ దున్మి
త్రిదశమాతకు వగద్దీర్చినావు

తే॥ గీ॥ సంఘకార్యంబులకుఁ గాక ♦ స్వార్థసిద్ధి
కొఱకు నిన్నాశ్రయించని ♦ సురలు గలరె
మధుసూదనవిలాస కోటిమ ♦ న్మథవిలాస
శ్రితమనోవాస జయజయ ♦ శ్రీనివాస 6

సీ॥ నీయాజ్ఞఁగొనివైన ♦ కేయుఁ డప్రాకృత
మహితరత్నవితాన ♦ మండితంబు

తపనీయశృంగాంచి ♦ తంబు చంపకశాల
హింతాలపున్నాగ ♦ దంతురంబు
కాంచనమయవృక్ష ♦ కలితంబు పరిమేయ
సురతరుసముదయ ♦ శోభితంబు
శ్రుతిసుఖావహహంస ♦ శుకపికశారికా
కలనాదసంతాన ♦ సులలితంబు
శార్దూల సింహాగ ♦ జశ్రేష్ఠ మర్కట
ముఖమృగసంరావ ♦ ముఖరితంబు
సతతగాయత్రిప్రసన్న ♦ రతతిసమాక్రాంత
సానుదేశప్రభా ♦ మానితంబు
దివ్యమానివికాయ ♦ దీపితఖనియుతం
బహిరతబృందార ♦ కాశ్రితంబు
సర్వపాపహరంబు ♦ సముదితవైభవ
పుణ్యతీర్థవితాన ♦ భూషితంబు
కరివారదేవతా ♦ కటలవిభ్రాజితం
బనుపమజలజాక ♦ రాంచితంబు
నగుచు శ్రీవైకుంఠ ♦ నగరంబునందుండు
క్రీడాద్రిభుజములం ♦ గీలుకొల్పి
భానుకోటిప్రభా ♦ భాసమానుండౌచు
నతితరజవముచే ♦ నవని జేర్చ
మెచ్చి కృపామృతం ♦ బిచ్చి తచ్ఛేషాద్రి
శిఖరోపకంఠసం ♦ స్థితినిబొంది

పొల్పొందు శ్రీస్వామి ♦ పుష్కరిణీతట
దక్షిణాంశంబునం ♦ దనరుచున్న
మణిమయదివ్యవి ♦ మానరాజమునందు
నతజీవతతిఁ బ్రోవఁ ♦ గుతుకమంది
దివ్యాయుధప్రభా ♦ దేదీప్యమానవి
గ్రహుఁడవై ధర్మార్థ ♦ రక్షణుఁడవౌచు
వేంచేసియున్న నీ ♦ పవిత్రకటాక్షణ
చణతహృదాగ్రహో ♦ చరముగాదె

తే॥ గీ॥ బ్రహ్మరుద్రేంద్రులకునైన ♦ భవ్యచరిత
నిరతవాంఛితవందారు ♦ నిఖిలదురిత
మధుమదవిరాస కోటిమ ♦ న్మథవిలాస
శ్రితమనోవాస జయజయ ♦ శ్రీనివాస 7

సీ॥ మీనివాసంబులౌ ♦ మహిమప్రతిష్ఠిత
వైకుంఠములకంటె ♦ వన్నెకెక్కె
మంత్రతపోయజ్ఞ ♦ మహిమానురూపసం
సిద్ధిప్రదానస ♦ మృద్ధిమించి
సతతేహితవరఫల ♦ సాధనభూతమా
శ్వత్తీర్థాళి చేఁ ♦ దేజరిల్లి
రాజ్యపుత్రసురూప ♦ రణవిజయాది కా
మ్యార్థదాయకమౌచు ♦ నతిశయించి

తే॥ గీ॥ ఉర్వి శ్రీవేంకటాఖ్యాత ♦ గోత్రమంబు
సిరిరహించుట కాదు ♦ వేంచేయుకొఱకె

మధుమదవిరాస కోటిమ ♦ న్మథవిలాస
శ్రితమనోవాస జయజయ ♦ శ్రీనివాస ౧

సీ॥ చింతితార్థప్రద ♦ శిలంబగుటఁజేసి
చింతామణియటంచుఁ ♦ జెప్పఁబడియె
జ్ఞానప్రదంబౌట ♦ నానామునీశ్వరుల్
గని యిది జ్ఞానాద్రి ♦ యనిరి మున్ను
నిఖిలతీర్థవితాన ♦ నిలయమైనకతనఁ
దీర్థాద్రియను పేరఁ ♦ దెచ్చుకొనియె
నిరతపుష్కరసరో ♦ వరయుతమౌటచేఁ
బుష్కరాద్రిపదంబు ♦ పొందువడియె

తే॥ గీ॥ ధర్మదేవతతపము వ ♦ ర్ధనముఁజెంద
వచ్చె ధర్మాచలాఖ్య నీ ♦ వసతి కహహ
మధుమదవిరాస కోటిమ ♦ న్మథవిలాస
శ్రితమనోవాస జయజయ ♦ శ్రీనివాస ౨

సీ॥ వృషభాఖ్యుడైతేయ ♦ విభుఁడు నీతోఁ బోరి
కడ కతిజ్ఞానియై ♦ కమలనేత్ర
గర్హితంబైన యీ ♦ కాయమ్ము నే నొల్ల
సర్వేశ నన్ను నీ ♦ చక్రధారఁ
బొరిగొని నాపేరఁ ♦ బొనరుమిట్టిశైల
తల్లజముఁ జేయు ♦ దయవహించి
యని వేడ నీ వది ♦ విని యట్లు చేసినం
దున వృషభాద్రియం ♦ చనఁగనయ్యె

తే॥ గీ॥ నొప్పఁ గనకాద్రి పేర నీ ♦ వున్న కొండ
కనకమయసానుచయముల ♦ కలిమి యొలయు
మధుమదనిరాస కోటిమ ♦ న్మథవిలాస
శ్రితమనోవాస జయజయ ♦ శ్రీనివాస 10

సీ॥ నారాయణాఖ్యచే ♦ వలరెడు ద్విజుఁ డొకఁడు
డతినిష్ఠతోఁ దపం ♦ బాచరించి
తనపేర విఖ్యాతిఁ ♦ గనునీనగోత్తమం
బర్థించె నిన్నతఁ ♦ డందువలన
నారాయణాద్రి నా ♦ నామధేయముఁ జెందె
వైకుంఠపురినుండి ♦ వసుధమీఁద
వ్రాలినదగుటచేఁ ♦ గాలవేత్తలు దీనిఁ
బలికిరి వైకుంఠ ♦ పర్వతమని

తే॥ గీ॥ సకలధాత్రీకములకును ♦ సంజ్ఞలొనఁగి
వెలయఁజేసెడు నీగిరి ♦ పేర్లెనయదె
మధుమదనిరాస కోటిమ ♦ న్మథవిలాస
శ్రితమనోవాస జయజయ ♦ శ్రీనివాస 11

సీ॥ ఆహిరణ్యకశిపుఁ ♦ డను దివిషుట్టు దై
తేయుని ప్రాణము ♦ ల్దీసి నీవుఁ
బరమభక్తుండైన ♦ ప్రహ్లాదు నేలుట
కై నృసింహాకృతి ♦ నవధరించి
తామిందు వెంచేయ ♦ ధన్యాత్ములా మునుల్
సింహాచలంబనుచుఁ ♦ జెప్పి రింక

సంజనాదేవి యిం ♦ దతి ఘోరమౌ తపం
బొనరించి హనుమనిఁ ♦ గనిన సమయ
తే॥ గీ॥ మందు నిర్జరు లరుదెంచి ♦ యనిన కతన
సంజనాచలమయ్యె నీ ♦ యాశ్రయమ్ము
మధుసూదనవిరాస కోటిసు ♦ న్మథవిలాస
శ్రితమనోవాస జయజయ ♦ శ్రీనివాస 12

సీ॥ శ్రీవరాహక్షేత్ర ♦ చిహ్నితమౌటచే
ననివరాహాద్రియం ♦ చఖిల జనము
ధర నీలుఁడనెడు వా ♦ నరపతి కిచి నిత్య
వాసమై నీలప ♦ ర్వతమునయ్యె
వేంకార మమృతధా ♦ రాంకితమగు బీజ
మైశ్వర్యవాచకం ♦ బటుకటమద
మేతద్ద్వయవికాస ♦ హేతువౌటం గని
వేంకటాద్రి యటంచు ♦ వేల్పులనిరి
తే॥ గీ॥ శ్రీనివాసుఁడవైనట్టి ♦ నీ నివాస
మట్టి విఖ్యాతిఁ బరఁగుట ♦ యబ్బురంబె
మధుమదనిరాస కోటిసు ♦ న్మథవిలాస
శ్రితమనోవాస జయజయ ♦ శ్రీనివాస 13

సీ॥ తావకోత్ఖేలన ♦ స్థానంబగుటఁజేసి
వైకుంఠనగరి ని ♦ వాసులెల్ల
రానందగిరి వరం ♦ బని కొల్తు శ్రీదేవి
నిత్యనివా యాద్రిపై ♦ నిలిచియుంట

సనిశము శ్రీప్రదం ♦ బై వెలుంగుచునుంట
వరసి తాసురసభ ♦ వాది నిఖిల
భక్తు లనిరి శబ్ద ♦ శక్తిచే యోగంబు
చేతను రూఢిచే ♦ శ్రీనగమని

తే॥ గీ॥ మొదల గరుడుండు భుజబల ♦ మున ధరిత్రి
కమరఁదెచ్చుట గరుడాచ ♦ లాఖ్యమయ్యె
మాధుమదనిరాస కోటిమ ♦ న్మథవిలాస
శ్రితమనోవాస జయజయ ♦ శ్రీనివాస 14

సీ॥ ఆదిశేషుని యుప ♦ రావతారంబైన
దాటచే శేషాద్రి ♦ యనఁగ నొప్పెఁ
గల్పభేదంబుచేఁ ♦ గలవు నామములెన్ని
యేని ననంతుండ ♦ వైన నీకు
నావాసమై చెంద ♦ దా యేమి లెక్కకు
మిక్కిలియగా నాఖ్య ♦ లక్కజముగఁ
గాన నీ క్రీడాద్రి ♦ కలివిఁక నీడెందుఁ
గలదు యీ రేడు జ ♦ గంబులందుఁ

తే॥ గీ॥ దన్మహాత్వ మెఱుంగఁగ ♦ ధాత్రి ముఖ్య
సుర లశక్తులుగా రొకో ♦ వరగుణాఢ్య
మధుమదనిరాస కోటిమ ♦ న్మథవిలాస
శ్రితమనోవాస జయజయ ♦ శ్రీనివాస 15

సీ॥ సకలలోకైక క ♦ రుణచణత్వము నొంది
తత్కూటభాగమం ♦ దధి వసించి

కలికాలజనులకుఁ ♦ గల్పభూరుహమనఁ
దేజరిల్లెడు భవ ♦ ద్దివ్యపాద
సరసిజభక్తి నా ♦ స్వాంతమందున నిల్పి
చరితార్థుఁ జేయుమో ♦ చక్రహస్త
నీ మానసంబున ♦ నిర్హేతుకంబైన
దయఁ బూనవలెఁగాని ♦ దాసులయెడఁ

తే॥ గీ॥ దప్పులెంచుట తగవుగా ♦ దొప్పులెకల
చరితమేరికి నున్నదే ♦ జగమునందు
మధుమదనిరాస కోటిమ ♦ న్మథవిలాస
శ్రితమనోవాస జయజయ ♦ శ్రీనివాస 16

సీ॥ శేషాచలారణ్య ♦ సీమ బాలుండవై
సంచరించుచు నొక్క ♦ శాఖక్రింద
మొదలనగ్నిష్టోమ ♦ ముఖ్యక్రతువులెల్ల
సమయమారసి చేయఁ ♦ జాలనైతి
మఁదిఁ మదిదప్పని ♦ ప్పుడు దేవఋణమెట్లు
తీర్చెదనని పరి ♦ దేవనంబు
సేయుచుండిన ద్విజ ♦ శ్రేష్ఠునొక్కనిఁజూచి
యనుపమ కరుణార ♦ సార్ద్రమాన
సుండవై తద్వృద్ధు ♦ సారిదిఁజేరి శుభోద
సంకల్పసిద్ధ ని ♦ ర్ఝరిణినొకటి
దృగ్గోచరముఁజేసి ♦ దివ్యమాతతీర్థ
మునమునుంచి లేవఁదీ ♦ సిన మహాజ్ఞ

లక్ష్యమొంది కుమార ♦ లక్షణ లక్షితుం
డై విరాజిలువాని ♦ కాక్షణంబె
బ్రహ్మాదులకు దు ♦ ర్లభంబగు భవదీయ
సందర్శన మొసంగి ♦ సౌమ్యయింక
సర్వేష్టులొనరించి ♦ సార్థేష్టుఁడవు కమ్ము
వలసినంతటి సిరి ♦ కలిగి శీఘ్రము
కాలంబులోనంచుఁ ♦ బలికించునంతలో
దివిదుందుభుల్ మ్రోసె ♦ దిక్కులెల్ల
సుప్రసన్నంబులై ♦ శోభిల్లె సుమవృష్టిఁ
గురియించి దేవత ♦ ల్గుములుఁ గూడి
తత్పరిస్రవణ మహ ♦ త్వముఁ గొనియాడి యిం
దవగాహనముఁ జేసి ♦ యువనిసురుఁడు
నూత్నోద్గవాఁడు కు ♦ మారుఁడైన కతన
నీరోజు మొదలు కు ♦ మారధార
యనఁగ విఖ్యాతి నొం ♦ దును లోకమందిది
మానసత్రయంబిందు ♦ మానవుండు
జితపంకుఁడై స్నాన ♦ మతులిత భక్తితో
ముప్పేళలం జేసి ♦ ముప్పువీడి
షోడశాబ్దవయో వి ♦ శోభితుండయి చిర
సౌఖ్యం బనుభవించి ♦ స్వామి దయకుఁ

తే॥ గీ॥ పాత్రుఁడౌనని చనిరి నీ ♦ వత్సలతకు
నింత హద్దని కలదె యో ♦ గీశ్వరేశ

మధుసూదనిరాస కోటిమ ♦ న్మథవిలాస
శ్రితమనోవాస జయజయ ♦ శ్రీనివాస 17

సీ॥ గానముసేయు నీ ♦ కథలు నిర్జర మునుల్
సూటిగా వీణలు ♦ గోఁ మీటి
అనయము నీసాయ ♦ మున సర్వదిక్కులం
గనెఁ బేరు విజయుఁడం ♦ చని కిరీటి
కడగంటి చూపుచే ♦ నిడె సిరిఁ గమలజా
దులకు నీయురమునం ♦ దుఁగల బోటి
అసురవైరులు గుండె ♦ లదరుచ బర్విడుచుండ్రు
సైరింపలేక నీ ♦ సైన్యధాటి

తే॥ గీ॥ దేవ నీకడిగాపవో ♦ దివ్యకోటి
భువనరక్షణమందు నీ ♦ కెవరు సాటి
మధుమదనిరాస కోటిమ ♦ న్మథవిలాస
శ్రితమనోవాస జయజయ ♦ శ్రీనివాస 18

సీ॥ అర్థింప శ్రీనివా ♦ సాధ్వరి ప్రీతిమై
తలవంచితో మాలఁ ♦ దాల్చితీవు
తొండమాన్వసుమతీ ♦ శుండు గోరిన శంఖ
చక్రముల్గ్రృపతో నొ ♦ సంగితీవు
వేడిన గూనిగో ♦ విందునకై కాశి
వీడి గోష్ఠిపురి ♦ న్వడిసితీవు
కచభారమూని శ్రీ ♦ కాకుళనగరినై
ఖానసేచ్ఛం దీర్చఁ ♦ గలిగితీవు

తే॥ గీ॥ ఎవరు నిన్నాశ్రయించి ని ♦ ర్వేలమైన
శుభవితానము నొందరే ♦ దభయవరద
మధుమదవిరాస కోటిను ♦ న్మథవిలాస
శ్రితమనోవాస జయజయ ♦ శ్రీనివాస 19

సీ॥ ఫణిపతి భూధరం ♦ బున నందనాటవీ
ప్రాంతంబునం దన ♦ కాంతిఁగూడి
త్రవ్వుచునతివిశా ♦ లతటాక మున్వసా
హ్యము లేక శ్రీమద ♦ నంతసూరి
పరిపూర్ణగర్భయా ♦ భాగ్యను మృద్భార
మూన నియోగించి ♦ పూనితాను
ఖననము సేయు న ♦ క్కాంతాలలామ దు
ర్భరఖేదముపవయిం ♦ పఁగఁ దలంచి
మాణవకుండవై ♦ మార్గమధ్యంబునం
జా రాము చేతిమృ ♦ ద్భరమీావు
గైకొని యావలఁ ♦ గట్టవేయుచునుండ
గదిమాచి యొకదిన ♦ మస్మదీయ
కైంకర్యఫలభాగ ♦ కాముండవవఁడవీ
వగ్భక యని రోష ♦ మతిశయిల్లఁ
బలుకుచు వెన్వెంటఁ ♦ బర్విడి యువదార
ణము చేతఁ జటుకదే ♦ శమున వ్రేయ
రక్తధారాక్త వ ♦ క్త్రద్వయుండవునయ్యు
మానీంద్రదుర్లభం ♦ బైన దివ్య

మంగళాకృతిఁ జూపి ♦ సంగనుంగొని మహీ
సురుఁడతిభీతితో ♦ శరణు శరణు
భక్తవత్సల! యంచుఁ ♦ బాదాంబుజములపైఁ
బడి శ్రుతిసూక్తులం ♦ బ్రస్తుతింప
నార్యమాభీస్తప్రియా ♦ కార్యాత్రయుని మోము
నందు లేనగవులుఁ ♦ సందడిల్లఁ

తే॥ గీ॥ కరుణతోఁ బ్రోచినట్టి నీ ♦ పరమశాంత
భావ మేప్రొద్దు మమ్ముఁ గా ♦ పాడుఁగాక
మధుమదనిరాస కోటిమ ♦ న్మథవిలాస
శ్రితమనోవాస జయజయ ♦ శ్రీనివాస 20

సీ॥ శంఖణుడాత్మతా ♦ జ్యమునొందె స్వామిపు
ష్కరిణీజలస్నాన ♦ ఫలము వలన
కాయరసాయనా ♦ ఖ్యాక తీర్థస్నాన
కలన మానులు దృఢ ♦ కాయులైరి
ఆస్థిసరోవరం ♦ బందు మునిచిన వీర
శర్మపురంధ్రి త ♦ రుణమెబ్రదికె
ఘోణతీర్థస్నాన ♦ పానాదికముల స
ర్వబద్ధుఁడమితవి ♦ రాగియయ్యె

తే॥ గీ॥ సకలమహిమల వెలయు ష ♦ ట్షష్టికోటి
తీర్థముల నొప్పుచుండుఁ ద్వ ♦ ద్విహ్యాతిధరము
మధుమదనిరాస కోటిమ ♦ న్మథవిలాస
శ్రితమనోవాస జయజయ ♦ శ్రీనివాస 21

సీ॥ నిన్ను శ్రీవసుమతీ ♦ నీళలేకాంతమ్ము
నందు సేవించుచు ♦ న్నట్టివేళ
వచ్చిన తొండమాన్ ♦ వసుధాధిపునిఁ గాంచి
సిగ్గిలి భార్గవి ♦ చేరెనురము
వసుమతి దాఁ గొన ♦ వా పీఠిలయమునకు
శ్రీ మహానసమును ♦ జెందె వేళ
దీర్ఘిక నెఱకొన్న ♦ దేవికినీవు దా
ల్చిన షణ్ముఖాలిక ♦ ల్చెందఁజేయు

తే॥ గీ॥ చుందువట దాసులకు నీయు ♦ రంగువలన
వలదు లేకాలమును నీ ♦ యువసథమున
మధుమదనిరాస కోటిను ♦ న్మథవిలాస
శ్రితమనోవాస జయజయ ♦ శ్రీనివాస

సీ॥ కటితటఘటితరు ♦ క్మవసనప్రభలతోఁ
గాంచీమణిద్యుతుల్ ♦ గ్రందుకొనఁగ
రమణీయ దివ్య ♦ హారావళి దీప్తితో
శ్రీవత్సఘృణిరుచి ♦ శ్రీనటింప
స్వమయూఖ జితవిద్యు ♦ దమలకుండలకాంతి
గండద్యుతులతోడ ♦ మెండుకొనఁగ
మణికిరీట గభస్తి ♦ మండలితో నీల
కుటిలాలకప్రభల్ ♦ గూడియాడ

తే॥ గీ॥ సేవసాయించి నను ధన్యుఁ ♦ జేయవేని
చేతునిందా స్తవంబు ని ♦ స్ఫీతిమాని

మధుమదనిరాస కోటిమ ♦ న్మథవిలాస
శ్రితమనోవాస జయజయ ♦ శ్రీనివాస 23

సీ॥ సకలలోకవితాన ♦ జఠరుండవై యొక్క
మఱ్ఱియాకుననిల్చు ♦ మహిమయున్న
భువనకారణుఁడవై ♦ యవనియందొకయింతి
ముద్దులబిడ్డవౌ ♦ విద్దెయున్న
గో గోపకులఁగావఁ ♦ గొమరొప్ప వనవహ్నిఁ
బట్టి మ్రింగఁగఁజాలు ♦ ప్రతిభయున్న
నిందునందనక నీ ♦ వెంచఁ జూచినఁగాని
నిఖిల ప్రపంచంబు ♦ నిండియున్న

తే॥ గీ॥ నల్లమున నిన్ను ♦ వరిగింజముల్లుకన్న
హీనముగనెంతు ♦ నను బ్రోవఁ బూనకున్న
మధుమదనిరాస కోటిమ ♦ న్మథవిలాస
శ్రితమనోవాస జయజయ ♦ శ్రీనివాస 24

సీ॥ శరణాగతుల సేమ ♦ మరయుదునని పల్కి
సోమకుఁ బరిమార్చు ♦ టేమిఘనత
దాసదాసులమీఁద ♦ దయ యపారంబని
పౌలస్త్యుఁ ద్రుంచుట ♦ పాటికీర్తి
అనిసేయనని పల్కి ♦ ధూపగాతనయుపై
లంఘించుకొంటటి ♦ రాజనీతి
ననునమ్మఁ జెరుపనే ♦ ననుచు ఖల్లుకవాధు
తోఁ బోరు టేమంత ♦ దొడ్డతనము

తే॥ గీ॥ సమయసముచిత శేముషీ ♦ జాయమాన
విభవుఁడవు నీవు నన్నట్లు ♦ విశ్వసింతు
మధుమదనిరాస కోటిమ ♦ న్మథవిలాస
శ్రితమనోవాస జయజయ ♦ శ్రీనివాస 25

సీ॥ వెల్లిగొల్లలమధ్య ♦ వ్రేపల్లెలో నీవు
మాటసాగిన దొక్క ♦ నీటుగాదు
శాపముఅందియుఁడా ♦ పాండవాగ్రజువీట
గణుతింపఁబడు టొకట ♦ ఘనతగాదు
మధురాపురమునందు ♦ మాయికులౌ వారి
చెంతఁ బెత్తన మొక్క ♦ వింతగాదు
ద్వారకానగరని ♦ వాసుల నాజ్ఞచే
నడిపించు టది యొక్క ♦ కడిమిగాదు

తే॥ గీ॥ తెల్విఁ గల్గిన నీయందుఁ ♦ దిరముఁజేయు
మన్మనోవృత్తి నిఁక వేఱు ♦ మాటలేల
మధుమదనిరాస కోటిమ ♦ న్మథవిలాస
శ్రితమనోవాస జయజయ ♦ శ్రీనివాస 26

సీ॥ నిత్యజారుఁడవైన ♦ నీయందు సంపద
స్థిరమగు టతిచిత్ర ♦ తరముగాదె
రాజ్యభారం బూన ♦ రాని నీ కఖిల పృ
థ్వీశులు వశులౌట ♦ వింతగాదె
పెన్ముచ్చువౌ నిన్నుఁ ♦ బిలిచి పిల్లల నిచ్చు
టవనీశు లమిత చో ♦ ద్యంబుగాదె

అల పితామహుతాత ♦ వైన నిన్బ్రోవంగ
నలు గూడుటాశ్చర్య ♦ కరముగాదె

తే॥ గీ॥ మాయయను దివ్యసాధన ♦ మహిమవలన
నిన్నిటుల లాయెఁగాఁబోలు ♦ నేమిఘనత
మధుమదనిరాస కోటిమ ♦ న్మథవిలాస
శ్రితమనోవాస జయజయ ♦ శ్రీనివాస 27

సీ॥ అబ్ధిఁబుట్టిన లక్ష్మి ♦ యలముకోఁదగుఁగాక
గరళమాపుత్రినోటఁ ♦ దురుగఁదగునె
బలిదానవుని సిరి ♦ కడయఁదగుంగాక
గురుసకంధత్వంబుఁ ♦ గూర్పనగునె
కౌరవబలమెల్ల ♦ ఖండింపఁదగుఁగాక
చేరి ధర్మజునిమ్ముఁ ♦ జెఱుపఁదగునె
చెలగి చక్రము నీకుఁ ♦ జేబూనఁదగుఁగాక
యిలనన్నకొక రోక ♦ లీయనగునె

తే॥ గీ॥ ఇట్టిచేష్టలు లాలితు ♦ లెటుసహింత్రు
స్వామి! నీవారుమఱియును ♦ రేమొకాని
మధుమదనిరాస కోటిమ ♦ న్మథవిలాస
శ్రితమనోవాస జయజయ ♦ శ్రీనివాస 28

సీ॥ శిఖిపింఛమునువీడి ♦ క్షితితలాధిపుమాడ్కిఁ
దల రత్నమకుటంబుఁ ♦ దాల్చియున్న
గుఱిజదండలుదీసి ♦ కువలయాధిపురీతి
వేడ్కతో మణిమాల ♦ వేసికొన్న

మునికోలవిడవాడి ♦ జననాయకునిభంగి
పొల్పార శాతాసి ♦ బూనియున్న
గోక్షీర పరిమళ ♦ గోపనముం జేసి
యపనీశువలె గంధ ♦ మలఁదుకొన్న

తే॥ గీ॥ ఎన్ని వన్నెలుఁ జిన్నెలుఁ ♦ బన్నుచున్న
గొల్లవాఁడవు కావను ♦ కొనుఱుపున్న
మధుమదనిరాస కోటిమ ♦ న్మథవిలాస
శ్రితమనోవాస జయజయ ♦ శ్రీనివాస 29

సీ॥ గుణముమంచిదియైనఁ ♦ గోరినీకీయరే
ప్రముచ్చువై భైష్మిని ♦ దెచ్చుటేల
సమకులంబేయైన ♦ సభఁబూజసేయరే
తాంబూలమొసఁగుచోఁ ♦ దగవులేల
రాణకలిగియున్న ♦ రాజులర్పించరే
కట్టుగుడ్డకుఁ జాకిఁ ♦ గొట్టనేల
పురుషమాత్రుఁడవైనఁ ♦ బూబోణులీయరే
యొక కురూపిణి గంధ ♦ మొసఁగనేల

తే॥ గీ॥ తెలియవా మాకు నీ పెంపు ♦ తెంపు సొంపు
చలము కులమును "బిష్టపేమణ"మికేల
మధుమదనిరాస కోటిమ ♦ న్మథవిలాస
శ్రితమనోవాస జయజయ ♦ శ్రీనివాస 30

సీ॥ చేరిమీఁదుగఁ బుత్ర ♦ ఘాతమోర్చినసీకు
నాశ్రితులన నంత ♦ యాదరంబా

అనఁగఁ జెల్లెల రతు ♦ లనుభవించిన నీకుఁ
బరకాంతలం దెంత ♦ భక్తికలదొ
స్వకులగురుద్వేషి ♦ చరణమంటినఁ నీకుఁ
బెద్దలయెడనున్న ♦ ప్రీతియెంతొ
భ్రాతృగర్వము మాయఁ ♦ బన్ని త్రుంచిననీకు
మాదృశులం దెంత ♦ మమతకలదొ

తే॥ గీ॥ తెలుపనక్కఱలేకయే ♦ తెలియుచుండె
గాని నీ తత్త్వమెఱుఁ గఁగా ♦ గలరెయొకలు
మధుమదనిరాస కోటిమ ♦ న్మథవిలాస
శ్రితమనోవాస జయజయ ♦ శ్రీనివాస 31

సీ॥ వనవాసమొసరించు ♦ వనితను బ్రతిమాలి
కుండఁగఁడిననీకుఁ ♦ గొనరిత్రావి
జన్మదరిద్రుఁడై ♦ శరణన్నజోగిని
లాలించిపృథుకము ♦ లొక్కరినమలి
కూడ గుడ్డలకునై ♦ గొల్లబోయునియింటఁ
బరిచర్యసేయుచు ♦ బసులఁ గాచి
పరికృతజాయాప ♦ హారణ దుఃఖముమాని
కులహీనఁగూడి ♦ యెంగిలిభుజించి

తే॥ గీ॥ అన్నిలోకంబులందు నీ ♦ కన్న స్వల్పుఁ
డెవఁడు లేడని పేర్వడి ♦ తెంతఘనత
మధుమదనిరాస కోటిమ ♦ న్మథవిలాస
శ్రితమనోవాస జయజయ ♦ శ్రీనివాస 32

సీ॥ పసులబిడ్డను దెచ్చి ♦ బలియిచ్చుటకు నిచ్చి
తల్లిదండ్రులవీడి ♦ తరలుటొకటి
శత్రుధాటికి నోడి ♦ మిత్రునుండకెఁ గూడి
యుదధిలోఁ గాపురం ♦ బుండుటొకటి
గొల్లతేని కుమారి ♦ నల్లంబు సంగోరి
గోవధంబున కియ్య ♦ కొనుట దొకటి
మించుతీవలఁ బోలు ♦ చంచలాక్షుల చాలు
నుంచి యున్నకు వృద్ధ ♦ నొసఁగు టొకటి
తే॥ గీ॥ సకలభువనంబులందు నీ ♦ శక్తి ధైర్య
సాహసస్వాంత వృత్తులం ♦ జాటుచుండె
మధుమదనిరాస కోటిమ ♦ న్మథవిలాస
శ్రితమనోవాస జయజయ ♦ శ్రీనివాస 83

సీ॥ తండ్రి పుత్రునిఁబట్టి ♦ దండింపఁదగఁడొకో
దైత్యనాథుని జంపఁ ♦ దరముతేల
అన్నదమ్ములు వైర ♦ మందుట తగదొకో
వానరేంద్రుని గూల్పఁ ♦ బూననేల
అతివకుఁ బతిరహ ♦ స్యముఁ జెప్పఁ దగఁడొకో
చేరి పార్థుని వాంఛఁ ♦ జెరుపనేల
పౌండ్రుడు తద్దైవతంబుఁ ♦ బడయుఁగాఁ దగఁడొకో
ద్వేషివై యతని వ ♦ ధింపనేల
తే॥ గీ॥ ఏమి పనులివి మెచ్చునే ♦ భూమియందు
నూటికొకఁడైన మాటలిఁ ♦ కేటికిపుడు

మధుమదనిరాస కోటిమ ♦ న్మథవిలాస
శ్రితమనోవాస జయజయ ♦ శ్రీనివాస 34

సీ॥ పరజీవనంబులో ♦ బ్రదుకుచుండెదు నిన్ను
గోత్రవర్ధనుఁడంట ♦ గొప్పగాదె
గోగర్భమునుజొల్పఁ ♦ గోయుచుండెదు నిన్ను
బుఱువసింహుండంట ♦ పరువుగాదె
ఉచ్చమెంతయులేక ♦ బిచ్చమెత్తెదు నిన్ను
రణవీరుఁడనియుంట ♦ రాణగాదె
ఏఁడుదానికి నెప్పు ♦ డడుగుదాటవు నిన్ను
బలశాలియనుచుంట ♦ కలిమిగాదె

తే. గీ॥ దొంగవైనట్టి నిన్బ్రిబు ♦ ద్ధుండవంట
ఘనముగాదొకొ ♦ నీకల్కితనముఁగప్పి
మధుమదనిరాస కోటిమ ♦ న్మథవిలాస
శ్రితమనోవాస జయజయ ♦ శ్రీనివాస 35

సీ॥ నినుఁ ద్రాళ్ళఁగట్టఁగా ♦ మను బ్రయత్నించడే
సభలోనఁ గౌరవ ♦ సార్వభౌముఁ
డదరకు గోపాల! ♦ యనుచుగద్దించడే
యనిమొనం జేదిధ ♦ రాధిపుండు
ఎందుఁబోఁగలవు గో ♦ వింద! నిల్వుమటంచుఁ
గవియఁడే వెన్నంటి ♦ కాలయవనుఁ
డనరానిమాటల ♦ ననడె నిన్నుగరూశ
పతి విక్రమక్రమో ♦ ద్ధతి చెలంగ

తే॥ గీ॥ కాలవశమున మరణంబు ♦ గల్గఁగాని
యెవఁడు నినులక్ష్మపెట్టె భూ ♦ ధవులలోన
మధుమదవిరావ కోటిమ ♦ న్మథవిలాస
శ్రితమనోల్లాస జయజయ ♦ శ్రీనివాస 36

సీ॥ నిన్నుమద్దిడ నెత్తి ♦ కొన్నదావింబట్టి
కడఁద్రోసి ప్రాణము ♦ లాపవలెనె?
ఒంటరిగానుండ ♦ నోపి మందంగూడి
చరియించులేఁగను ♦ జంపవలెనె?
శ్రీదార్ఢ్యమిమ్ముఁ ♦ గూడియుంచిన వర
దంతకుంబట్టి ఖం ♦ ఖండింపవలెనె?
ఎన్ని యోతరముల ♦ కన్నఁ బూర్వమునుండి
యున్న మద్దులఁ గూలఁ ♦ దన్నవలెనె?

తే॥ గీ॥ ఆదినుండియు నిట్టికృ ♦ త్యములె చేసి
తితకుఁడానందపడు కార్య ♦ మేది చెప్పుమ
మధుమదనిరావ కోటిమ ♦ న్మథవిలాస
శ్రితమనోల్లాస జయజయ ♦ శ్రీనివాస 37

సీ॥ ఇచ్చవచ్చినవారి ♦ యింట నిల్చుచుఁబోవు
చుండు నెల్లపుడు నీ ♦ సుందరాంగి
అఖిలలోకంబులం ♦ దస్థిరకార్యము
ల్చేసి జీవించు నీ ♦ శ్యేష్ఠతనయుఁ
డొకనిఁజేపట్టి వే ♦ ఱొకనితోఁ గాఁపురం
బొనరించి పుత్రులం ♦ గనుఁగుమారి

దేవ, మానవ, పన్న ♦ గావళికన్యోన్య
విద్వేషముల్దెచ్చి ♦ పెట్టఁబాత్రుఁ

తే॥ గీ॥ దసలె కులగోత్ర శూన్యుఁడ ♦ వహహ ! నీవు
విదితమయ్యెను మఃవంశ ♦ విభవమెల్ల
మధుమదనిరాస కోటిమ ♦ న్మథవిలాస
శ్రితమనోవాస జయజయ ♦ శ్రీనివాస 38

సీ॥ తండ్రియాజ్ఞను మాళిఁ ♦ దాల్చినవారిలో
నెవఁడుతల్లినిజంపె ♦ నేపుమీర
గుహనియాపతిఁ ద్రోసి ♦ యురుగనివారిలో
స్త్రీవధం బెవఁ డొన ♦ రించెజగతి
నేకపత్నీవ్రతో ♦ ద్రేకమానుషులలోఁ
బరకాంతనెవ్వఁడు ♦ పరిభవించె
చెలికాని సంప్రీతుఁ ♦ జేసినవారిలో
నెవఁడొయ్యెఁగాన వధ ♦ ద్యుమ్నున కకట !

తే॥ గీ॥ నీవుగాకన్యుఁడీ లోక ♦ నిచయమందు
వేదవేద్యన కేటికి ♦ వగటుఁదనము?
మధుమదనిరాస కోటిమ ♦ న్మథవిలాస
శ్రితమనోవాస జయజయ ♦ శ్రీనివాస 39

సీ॥ మునివేషమున్బూని ♦ వనిఁ గాఁపురంబున్న
బరజీవహింసకై ♦ వెఱచినావె
సుగుణుండవని బుధు ♦ ల్చట్టి కొల్చుచునున్న
మర్కటసఖ్యంబు ♦ మానినావె

నిర్మోహుఁడని మును ♦ ల్నిను మెచ్చుకొనుచున్న
గొల్లకన్నెల వీడఁ ♦ గోరినావె
పరమవైదికులు నిన్ ♦ బ్రభువఁడనుచున్నఁ
బక్షపాతము మది ♦ వ్యాపినావె
తే॥ గీ॥ ఇట్టిగుణములుగలవార ♦ లెవ్వరైన
నవనిదుష్కీర్తిభాజులౌ ♦ టబ్బురంబె
మధుమదనిరాస కోటిమ ♦ న్మథవిలాస
శ్రితమనోవాస జయజయ ♦ శ్రీనివాస 40

సీ॥ మోసగాఁడవనిన ♦ రోసమున్నదెనీకు
బహుజారుఁడవటన్న ♦ భయముకలదె
భిక్షాశనుఁడవన్న ♦ బిడియముకలదొకో
లంచగొండివనిన ♦ లాఘవంబె
మొండివాఁడవటన్న ♦ దండింప దొరఁకొన
వల్పుఁడవన్న నీ ♦ వలుగవెపుడు
చోరుండవనుచున్న ♦ మాటాడవేప్రొద్దు
గుణహీనుఁడవటన్న ♦ గినియవకట
తే॥ గీ॥ భక్తులేమన్ననిష్టమా ♦ శక్తిలేదొ
తెలిసికొనఁదిరికేరికి ♦ కలియుగమున
మధుమదనిరాస కోటిమ ♦ న్మథవిలాస
శ్రితమనోవాస జయజయ ♦ శ్రీనివాస

సీ॥ చెట్టుచాటుననుండి ♦ కొట్టకేపోయిన
వాలిజీవముదీయ ♦ వశమగునొకో

వాతాత్మజాతుండు ♦ దూతయేగాకున్న
సతిజాడఁగన నీకు ♦ సాధ్యమగునె
మిత్రనందనుఁడాత్మ ♦ మిత్రుఁడేకాకున్న
దండుతో లంకకుఁ ♦ దరలఁగలవె
ఆవిభీషణుఁడప్పు ♦ డాప్తుఁడేకాకున్న
దశకంధరుని జంపఁ ♦ దరమెనీకు

తే॥ గీ॥ ధరణికోజాలు మంచివై ♦ దనరెఁగాన
వీరుఁడన నేనయని కీర్తి ♦ వీగితపుడు
మధుమదనిరాస కోటిమ ♦ న్మథవిలాస
శ్రితమనోవాస జయజయ ♦ శ్రీనివాస 42

సీ॥ అండజంబునకైనఁ ♦ జండవిక్రమముండుఁ
గమఠంబునకు లేదా ♦ గర్వమకట
అడవిపందికిఁగూడ ♦ గడుశావరంబుండు
నరమృగంబునకైనఁ ♦ గరుణకలదు
పొట్టిమానిసికి నిం ♦ పుగ గౌరవంబబ్బు
బడుగుబాపనికైన ♦ బలముకద్దు
అడవినుండినవాని ♦ కైన యశముగల్గు
ముసలియైనను రోష ♦ మునఁబెనంగు

తే॥ గీ॥ తస్కరునకైనఁ బూరుష ♦ ధర్మముండు
నీకు లేదెద్ది కలికివై ♦ నిల్వమింక
మధుమదనిరాస కోటిమ ♦ న్మథవిలాస
శ్రితమనోవాస జయజయ ♦ శ్రీనివాస 43

సీ॥ కనుఁగొనకటులుండి ♦ యనుఁగుఁ జెల్లెలబిడ్డ
వనిఁ జావఁజేసిన ♦ ఘనుఁడవీవు
పాంచాలి మనమునం ♦ బదిలముగానున్న
గుట్టుఁ జెప్పించిన ♦ దిట్టవీవు
అనయము నినుఁగొల్చు ♦ ననిమిష మునిచంద్రుఁ
బడఁతిఁగాఁజేసిన ♦ ప్రభుఁడవీవు
కాంతాలలామవై ♦ కరకంఠు మోహాబ్ధిఁ
బాఱఁద్రోసిన చమ ♦ త్కారివీవు

తే॥ గీ॥ గాన నిను నమ్మువార లెం ♦ దైనఁగలరె
జలధివలయిత వసుమతీ ♦ చక్రమందు
మధుమదనిరాస కోటిమ ♦ న్మథవిలాస
శ్రితమనోవాస జయజయ ♦ శ్రీనివాస 44

సీ॥ కరములఁ జోడించి ♦ శరణన్నవారిపై
దయఁజూనినందుకు ♦ ధనముఁగొనుట
నినుఁగాంచవచ్చిన ♦ మనుజులవాదిలోఁ
జెప్పుదెబ్బలుఁగొట్ట ♦ సిద్ధమగుట
కరుణఁజూడుమటన్న ♦ నిరతరాధులఁబట్టి
శిరములఁగొఱిగించి ♦ ముఱియుచుంట
మగఁడు గాంచుచునుండ ♦ మగువ మంగళసూత్ర
మును సైత మదలించి ♦ గొని కనుపుట

తే॥ గీ॥ నీకు తగిపోయె నీ రేడు ♦ లోకములకు
రాజువైనందు కిట్టి బై ♦ రాగివనుల

మధుమదనిరాస కోటిమ ♦ న్మథవిలాస
శ్రితమనోవాస జయజయ ♦ శ్రీనివాస 45

సీ॥ ఆకాశ రాజక ♦ న్యా సఖీజనముతో
భావము వెలిపుచ్చి ♦ పల్కునాడు
భద్రగుణోజ్జ్వలం ♦ బద్మావతిం గూర్చి
మని వకుళకుఁ జెప్పి ♦ పనుచునాఁడు
శ్రీ వియద్రాజపు ♦ రీశ్వరీనిలయంబు
సోదెకత్తియవోచుఁ ♦ జొచ్చునాఁడు
"పద్మావతీ! పద్మ! ♦ పద్మ! పద్మా!" యంచు
మాటికిఁ బలవించి ♦ మసలునాఁడు

తే॥ గీ॥ కనివినియు సైఁచెనన్నోళ ♦ జననియపుడె
నీటడంచదె మాసత్య ♦ బోటిదైన
మధుమదనిరాస కోటిమ ♦ న్మథవిలాస
శ్రితమనోవాస జయజయ ♦ శ్రీనివాస 46

సీ॥ నీహృదయంబుపై ♦ నివసించకేయున్న
జడదారిచేఁ దన్నుఁ ♦ బడయఁగలదె?
పతిగ నిన్నదలోన ♦ భావించకేయున్నఁ
జెంచెత చేతి ♦ శాసించఁగలదె?
నిను మనోవల్లభుం ♦ డని నమ్మకేయున్న
నాసురీకృత బాధ ♦ లందఁగలదె?
ప్రాణేశుఁడని నిన్నుఁ ♦ దానెంచకేయున్న
సవతుల కవ్వేళఁ ♦ జంకగలదె?

తే॥ గీ॥ గుబ్బెలుఁగని కములచే ♦ పట్టినిన్ను
నేమిసుఖపడెనటఁ గోప ♦ మేమొనీకు?
మధుమదనిరాస కోటిమ ♦ న్మథవిలాస
శ్రితమనోవాస జయజయ ♦ శ్రీనివాస 47

సీ॥ ప్లవగమొకరాటి కతన ♦ భాగమంటఁజికించి
సాగరంబులముంచ ♦ సగముచచ్చె
నవకీటకమటంచు ♦ నివురు సితద్వీప
సారసాక్షులచేతఁ ♦ జావుఁదప్పె
త్రిలోలుఁడగు నొక్క ♦ తేని కారాగృహ
సంవాసియై దేవా ♦ సౌఖ్యమెడలి
నతసురపతియైన ♦ నందికేశ్వరు తీవ్ర
శాపాగ్నికీలల ♦ నేపుఁదూలి

తే॥ గీ॥ అవని జీవచ్ఛవంబౌ ద ♦ శాస్యుఁ దున్మ
తహహా నీవెంత శూరుఁడ ♦ వైతివయ్య
మధుమదనిరాస కోటిమ ♦ న్మథవిలాస
శ్రితమనోవాస జయజయ ♦ శ్రీనివాస 48

సీ॥ జీవితసంశయ ♦ స్థితినున్న తండ్రిని
వీడి కానలఁ దిరు ♦ గాడువాఁడు
అనుజుని క్షుత్తృష్ణ ♦ లరయక వెన్వెంట
దేశాంతరంబులం ♦ ద్రిప్పువాఁడు
నిండుచూలాలైన ♦ నీ నీరజాక్షిని
వంచించి వనికిఁ ♦ బంపించువాఁడు

ఐహికేచ్ఛాశూన్యుఁ ♦ డా మునివరుఁ డంత
శరచాపధరుఁడవై ♦ తరలునాఁడు
తే॥ గీ॥ హెచ్చు మేలని యెవరు ని ♦ న్నెచ్చరించిరో
తెలియదామాకు గుణినంచుఁ ♦ దెలుపరాదు
మధుసూదన నిరాస కోటిమ ♦ న్మథవిలాస
శ్రితమనోవాస జయజయ ♦ శ్రీనివాస 49

సీ॥ నలుకఁజూచెదువాని ♦ విరసించి మాయచే
నేఁగి బ్రదికియున్న ♦ నేమిఫలము
బలశాలియౌ తృణా ♦ వర్తునితోఁ బోరి
సేమంబుగానున్న ♦ నేమిఫలము
కాళియోరగు విష ♦ జ్వాలలు సైరించి
భూమిపై మనినందు ♦ కేమిఫలము
గాంగేయునిశితాశు ♦ గాగ్ని భస్మముగాక
యిలనిల్చినందుల ♦ కేమిఫలము
తే॥ గీ॥ ఒరునిచేతికి నాసించి ♦ యుంటివిపుడు
హ్రీయు శ్రీయునుగల్గి యు ♦ మేయశౌర్య
మధుసూదన నిరాస కోటిమ ♦ న్మథవిలాస
శ్రితమనోవాస జయజయ ♦ శ్రీనివాస 50

సీ॥ ఆలఁబట్టిన క్రొవ్వుక్కి ♦ యాభీరులకుఁజిక్కి
ద్విజవర్యుపై నెక్కి ♦ విసము మెక్కి
దాయాదులను ద్రుంచి ♦ తరుణుల వలపించి
శూద్రునింట భుజించి ♦ సురహరించి

పుణ్యజనులఁ దిట్టి ♦ పాలతుకఁ బోఁగొట్టి
వసులతోడుత జెట్టి ♦ పట్టుపట్టి
బహుళ భర్తృకల మెచ్చి ♦ పరసహాయదయఁ దెచ్చి
కోఁతికిఁ జనవిచ్చి ♦ గుణము వుచ్చి
తే॥ గీ॥ తిరుగుచుండెడి నీ వెంత ♦ తీర్పరివొ కా
దొరకితివి మాకు నేటికి ♦ దొడ్డదొరవు
మధుమదనిరాస కోటిను ♦ న్మథవిలాస
శ్రితమనోవాస జయజయ ♦ శ్రీనివాస 52

సీ॥ తనవారిపిల్లలం ♦ దఱిమి చంపుచునుంట
భీతిచేబడఁ బై ♦ బెట్టుకొనుట
సస్యనాశముఁ జేయు ♦ సముఖమారయుచుంట
యాటలాడుచుఁ గానలం ♦ దిరుగుచుంట
కల్మికల్గియు నొడ్ల ♦ కడ బిచ్చమెత్తుట
పరధర్మము నుబూని ♦ పాటుఁబడుట
చిరజీవిపై నస్త్ర ♦ మొఱగించి చూచుటల్
గులుద్రావి యేటిపైఁ ♦ దిరుగబడుట
తే॥ గీ॥ వావిఁదప్పుట యెప్పుడో ♦ వాజినెక్కు
దనుచుమురియుట నీ నైజ ♦ గుణములౌర!
మధుమదనిరాస కోటిమ ♦ న్మథవిలాస
శ్రితమనోవాస జయజయ ♦ శ్రీనివాస 53

సీ॥ సమగుణులై యున్న ♦ సహజులందొకరుఁడిఁ
బరిపంథియనిచిద్ర ♦ మరయుచుంట

జనకుని గనుచుఁ ♦ దని ధ్యేవగించి త
త్తనయుని బ్రీతిమై ♦ గనుచునుంట
హితవళియని దార ♦ నతిరాగమునఁజూచి
పతిసపక్షాదిగాఁ ♦ బలుకుచుంట
దుహితగేహంబున ♦ సుహితతఁబడియుండి
యల్లుపైఁ గొఱగొఱ ♦ లాడుచుంట
తే॥ గీ॥ నీకు సహజంబులై ♦ కీర్తింపుచుండె
నార నినుఁబోలునట్టి గు ♦ ణాఢ్యుఁ డెవఁడు
మధుమదనిరాస కోటిమ ♦ న్మథవిలాస
శ్రితమనోవాస జయజయ ♦ శ్రీనివాస 53

సీ॥ ఉన్నవి లేనివిఁ ♦ బన్ని యన్నవశాని
మాట లన్నందుకై ♦ చేటుఁ దేకు
తెలియవే మున్నుమ ♦ త్సీతిగత్తు లరయుచో
నిత్యైకసాక్షివై ♦ నిలయునీకు
కష్టమొందెడువేళఁ ♦ గనులఁ గాంచ కిటుల
దిక్కెవ్వరని చేసి ♦ తివి వరాకు
నినుఁ దంత్రీవని నమ్మి ♦ చనవుక్షే నవియుంటిఁ
గాని దైవత్వమొందు ♦ గలదె మాకు
తే॥ గీ॥ దుష్టుఁడనియల్గి నన్నని ♦ తొల్కఁగిపోకు
రమ్ము నీకెల్లు తప్పుకు ♦ మమ్ము నాఁకు
మధుమదనిరాస కోటిమ ♦ న్మథవిలాస
శ్రితమనోవాస జయజయ ♦ శ్రీనివాస 54

సీ॥ ఎప్పటికప్పుడే ♦ యెదురాడ నేరక
భార్యమాటల నల్లఁ ♦ బ్రస్తుతించి
మాయామృగంబైన ♦ మారీచు వెన్నంటి
బహుదూర మిటునటుఁ ♦ బఱుగులెత్తి
జాయజాడ నెఱుంగ ♦ శక్తిచాలక చింత
నలయుచు వనములం ♦ గలయఁదిరిగి
పరిపూర్ణ మానుష ♦ భావబద్ధుఁడవైన
నీవు జటాయువు ♦ నేవిధమునఁ

తే॥ గీ॥ గరుణఁజేర్చితో "గచ్ఛలో ♦ కానుత్త
మా"నని వికుంఠపురిని వి ♦ మానమిచ్చి
మధుమదవిరాస కోటిమ ♦ న్మథవిలాస
శ్రితమనోవాస జయజయ ♦ శ్రీనివాస 55

సీ॥ ఇందీవరముసొంపు ♦ నింద్రనీలముపెంపుఁ
గలహించు తిరుమేని ♦ కాంతితోడ
చంద్రబింబముతీరు ♦ శరదంబుజముసౌరు
మోసపుచ్చెడు నగు ♦ మోముతోడ
శంపాలతలఁదీవిఁ ♦ జంపకంబుల తావి
వారించు పసిఁడి దు ♦ వ్వలువతోడ
పద్మినీపతిశోభ ♦ బడబానలముచేవఁ
బ్రహసించు కౌస్తుభ ♦ ప్రభలతోడ

తే॥ గీ॥ దివ్య రత్న విభూషణ ♦ దీప్తితోడ
నున్న నీమూర్తిఁ గనఁగోరి ♦ యున్నవాఁడ

మధుసూదనిరాస కోటిమ ♦ న్మథవిలాస
శ్రితమనోవాస జయజయ ♦ శ్రీనివాస 56

సీ॥ ఆర్తుఁడు జిజ్ఞాసు ♦ వర్థార్థిజ్ఞానియు
నను భజించుచునుండు ♦ రనుదినంబు
మంత్ర దైవత సాధ ♦ నాంతరంబులు లేక
నేవారలంత్రోతు ♦ నిఖిలకృత్య
ములుమాని యనియంటి ♦ మున్ను నేనార్తుఁడ
నవనీతచోర ♦ జ్ఞానపూజ్య
మైనఁగానిమ్ము నే ♦ ననరాదుగాని నా
కర్థాభిలాష శూ ♦ న్యంబెజ్ఞాని
తే॥ గీ॥ యనుదటంటవి యజ్ఞాని ♦ నైన నన్ను
గావ కెటుతప్పు తప్పనే ♦ దైవ మిప్పు
మధుసూదనిరాస కోటిమ ♦ న్మథవిలాస
శ్రితమనోవాస జయజయ ♦ శ్రీనివాస 57

సీ॥ ఇరువంకలకలంక ♦ హరిణాంక నవవంక
జముఖులౌ సతులతో ♦ సందడిల్ల
వరపీఠవరవార ♦ హార ధీర కరసీర
జముల దివ్యాస్త్రరా ♦ జములు వెలుఁగ
హరినీలమణిజాల ♦ తరుణాలఘుతమాల
ములఁబోలి తనుకాంతి ♦ ముద్దులొలుక
ఘనపాపహననాప ♦ ఘనతాపవినివాప
నము తావదద్యుతుల్ ♦ ప్రమద మొసఁగ

తే॥ గీ॥ హార కేయూర కటక కో • టీర హీర
రుచులు వెలుఁగొంద రమ్యమౌ • భుజలువాల
మధుమదనిరాస కోటిమ • న్మథవిలాస
శ్రితమనోవాస జయజయ • శ్రీనివాస 58

సీ॥ అతఁడెపో వితత వే • దార్థాళి విజ్ఞాత
యెవనిపై మీశీత • లేక్షణములో
అతఁడెపో కామము • ఖ్యారి షట్క విజేత
యెవనిపై మీశీత • లేక్షణములో
అతఁడెపో బ్రహ్మత • త్త్వామృత ప్రణేత
యెవనిపై మీశీత • లేక్షణములో
అతఁడెపో సకల యో • గాభ్యాసకవినేత
యెవనిపై మీశీత • లేక్షణములో

తే॥ గీ॥ అతఁడె మతిమంతుఁ డతిపూతుఁ • డాత్మవిదుఁడు
వందనీయుఁడు నిర్జర • బృందమునకు
మధుమదనిరాస కోటిమ • న్మథవిలాస
శ్రితమనోవాస జయజయ • శ్రీనివాస 59

సీ॥ బాజ్జయుందాకలి • పుట్టి బాధించెనా ?
యదుకిశోర ! యటంచు • నాయశోద
కలిత ముక్తాజాల • కమనీయ డోలికాం
తరశాయివౌ నిన్నుఁ • దత్క్షణంబె
కరపద్మములఁ దీసి • యురమున హత్తించి
కన్నీరుఁదుడుచుచుఁ • గన్నతండ్రి

యలసి తేయేడ్వకు ♦ మని స్తన్యమిడి చుంచు
నివిరిముద్దిడె నన్ని ♦ భవములందుఁ
తే॥ గీ॥ జేసియుండిన పుణ్యమో ♦ చెప్పనగున
ధాతకైనను బ్రహ్మధాధి ♦ నేతకైన
మధుమదనిరాస కోటిమ ♦ న్మథవిలాస
శ్రితమనోవాస జయజయ ♦ శ్రీనివాస 60

సీ॥ అక్షపాదుని దార ♦ యందొకయినుమంత
ప్రకటితంబయ్యె మీ ♦ పావనత్వ
మతిబల శివచాప ♦ మందొక యినుమంత
తోఁచె నేలినవారి ♦ దోర్బలంబు
అభిమంత్రిత తృణాగ్ర ♦ మందొక యినుమంత
మొనలారె యున్మద ♦ ధీశ్వరత్వ
మాశబరాంగన ♦ యందొక యినుమంత
నరిమీరె దేవర ♦ సామరస్య
తే॥ గీ॥ మదియుఁ బతిఁజేర నిది భగ్న ♦ మైన నదియు
సురల భయపెట్ట నిదియును ♦ బదమఁజెంద
మధుమదనిరాస కోటిమ ♦ న్మథవిలాస
శ్రితమనోవాస జయజయ ♦ శ్రీనివాస 61

సీ॥ గతజన్మశతసంచి ♦ తసమహాపాప
కుంజరోత్కటసింహ ♦ ఘోషణములు
అవిరతధర్మేత ♦ రాధ్వప్రవర్తన
క్రూరకాపుత్యక్త ♦ క్షేమణములు

పటుతరరోష సం ♦ ఘటిత సముద్వేగ
వివశమృత్యుస్వాంత ♦ భీషణములు
బహుజన్మసుకృత సం ♦ పాదిత యోగవి
ద్యోతిత హృదయైక ♦ తోషణములు
తే॥ గీ॥ ఈషణత్యక్తముక్తిగ ♦ వేషణములు
భవదనావిల గుణగణ ♦ భాషణములు
మధుమదనిరాస కోటిమ ♦ న్మథవిలాస
శ్రితమనోవాస జయజయ ♦ శ్రీనివాస 62

సీ॥ సంసృతిక్లేశతు ♦ షారభానుప్రభా
సంతతికాదె మీ ♦ చరణసేవ
తాపత్రయ కఠోర ♦ దవవహ్నికలికా
జలధారకాదె మీ ♦ చరణసేవ
సకలపాపవితాన ♦ జలరాశిబాడబ
జ్వాలకంబుకాదె మీ ♦ చరణసేవ
అవిరతాపద్వారి ♦ దానీకవాతూల
సంహతికాదె మీ ♦ చరణసేవ.
తే॥ గీ॥ కాదె మోక్షాభిధనిధి ప్ర ♦ కాశకరణ
పరమసిద్ధాంజనమ్ము మీ ♦ చరణసేవ
మధుమదనిరాస కోటిమ ♦ న్మథవిలాస
శ్రితమనోవాస జయజయ ♦ శ్రీనివాస 63

సీ॥ వందారులకు నెల్ల ♦ మందారమూఁగాదె
బృందారకేశ నీ ♦ యందు భక్తి

పొంగారు మంగొంగు ♦ బంగారుగాదె శ్రీ
శృంగారధర ♦ భవత్సంగసక్తి
యమునాసహజకోప ♦ శమనౌషధముగాదె
సుమనోజ్ఞశ్వశ్వాద ♦ కమలభక్తి
అరిగర్వశర్వత ♦ స్వరుగుడుహతిగాదె
సర్వేశ నీకథా ♦ శ్రవణరక్తి
తే॥ గీ॥ భవసురోదర నిజమైక ♦ భద్రయుక్తి
గాదె నీదివ్యవిభవ ప్ర ♦ కాశశోక్తి
మధుమదనిరాస కోటిమ ♦ న్మథవిలాస
శ్రితమనోవాస జయజయ ♦ శ్రీనివాస 64

సీ॥ అపరాధమొనరించి ♦ కృపఁజూడుమని వేడ
నీడోద్భవాధము ♦ నీవిడనావె
అలివని నినుఁదాఁకి ♦ శరణార్థివన్న శ
త్రునిగావ కలనిపైఁ ♦ గినిసినావె
కార్పణ్యమునఁబోరె ♦ కమలాక్షు కావుమం
చనిన భల్లుకనాథుఁ ♦ దునిమినావె
ఉరమునఁదన్ని శ్రీ ♦ వరపాహిమాంపాహి
యను భృగుమానిపై ♦ నలిగినావె
తే॥ గీ॥ ఎంతదాక్షిణ్యమో ♦ భువనాంతరంగ
నేను నీవాఁడనన్న నీ ♦ మానసమున
మధుమదనిరాస కోటిమ ♦ న్మథవిలాస
శ్రితమనోవాస జయజయ ♦ శ్రీనివాస 65

సీ॥ అతిదరిద్రుండైన ♦ నవనిధీశ్వరుఁడుగాఁడె
భవదంఘ్రిరాజీవ ♦ భక్తిచేత
పుట్టుఁకల్లరియైన ♦ బుద్ధిమంతుఁడుగాఁడె
భవదంఘ్రిరాజీవ ♦ భక్తిచేత
విగతసుకృతియైన ♦ విజ్ఞానఖనిగాఁడె
భవదంఘ్రిరాజీవ ♦ భక్తిచేత
బాలిశుండైన వి ♦ ద్వద్వరిష్ఠుఁడుగాఁడె
భవదంఘ్రిరాజీవ ♦ భక్తిచేత

తే॥ గీ॥ మూఁగయైనను గవిగాఁడె ♦ మునులు మెచ్చ
భవ్యభవదంఘ్రి రాజీవ ♦ భక్తిచేత
మధుమదనిరాస కోటిమ ♦ న్మథవిలాస
శ్రితమనోవాస జయజయ ♦ శ్రీనివాస 66

సీ॥ నీచరణంబులే ♦ నిఖిలలోకాధీశ
శర్వహృత్పంకేజ ♦ షట్పదములు
నీయంఘ్రులే విశ్వ ♦ నిలయాంతరవిలోల
శ్రుతిసుందరీ శిర ♦ శ్శోభితములు
నీదివ్యపదములే ♦ యాదవాద్రివిహార
పాలేటికొమరిత ♦ పట్టుఁగొమ్మలు
నీయడ్గుదమ్ములే ♦ నిత్యసత్యవిలాస
భూరిమోక్షపథైక ♦ భూషణములు

తే॥ గీ॥ తావకీనపదంబులే ♦ తామరసభ
వాది నిర్జరభవభయ ♦ భేదకములు

మధుమదనిరాస కోటిమ ♦ న్మథవిలాస
శ్రితమనోవాస జయజయ ♦ శ్రీనివాస 67

సీ॥ అఖిలాండకోటి బ్ర ♦ హ్మాండభాండోదర
స్థిరచరాచరపంక్తి ♦ జీవనములు
కృతపూర్వభవకోటి ♦ వితతదుష్కృతలతా
పీవరమూలైక ♦ లావనములు
సకలయోగివితాన ♦ సహజగంభీర సం
పత్కళా లలితహృ ♦ త్పావనములు
విరతదారిద్ర్య దు ♦ స్తరశోకనిర్మగ్న
పద్మాకటాక్ష సం ♦ భావనములు
తే॥ గీ॥ దివిజపతి ముఖ్యసురవర ♦ దేవనములు
దేవ మీ దివ్యపాదసం ♦ సేవనములు
మధుమదనిరాస కోటిమ ♦ న్మథవిలాస
శ్రితమనోవాస జయజయ ♦ శ్రీనివాస 68

సీ॥ చిత్రములే కావు ♦ శ్రీవరలోకప
విత్రముల్గద నీచ ♦ రిత్రము లహ
శ్రీపములే కావు ♦ శ్రితజనావనజ్ఞాన
దీపముల్గద త్వదా ♦ లాపములహ
అవనములే కావు ♦ భువనేశభవమేఘ
పవనముల్గద భవ ♦ న్నవనములహ
శరణములే కావు ♦ కరుణామయాంబుధి
తరణముల్గద భవ ♦ చ్చరణములహ

తే॥ గీ॥ మదనమథనము లేకావు ♦ మహితవృత్తి
సుధనము ల్గద భవదీయ ♦ కథనములహా
మధుమదనిరాస కోటిను ♦ న్మథవిలాస
శ్రితమనోవాస జయజయ ♦ శ్రీనివాస 69

సీ॥ ఆత్మజప్రేమచే ♦ నలరి నిన్బెంచిన
వకుళమాలికకన్న ♦ సుకృతమెంతొ
ప్రత్యక్షముఁగ నోగి ♦ రము నీకొసంగిన
శ్రీనివాసాధ్వరి ♦ శీలమెంతొ
నీతోఁ బగడసాల ♦ నిరత మాడుచునున్న
హాత్తిరాంభక్తి సం ♦ పత్తియెంతొ
నీ కాత్మజ నొసంగి ♦ నిత్య కింకరుఁడైన
వియదవనీశు న ♦ ద్విభవమెంతొ

తే॥ గీ॥ దివ్యనిలయాది నిర్మాణ ♦ దీక్షనున్న
తోండమాన్నృపవర్యు సం ♦ తోషమెంతొ
మధుమదనిరాస కోటిమ ♦ న్మథవిలాస
శ్రితమనోవాస జయజయ ♦ శ్రీనివాస 70

సీ॥ ప్రాభాతనీరజ ♦ ప్రభఁదలఁకించు న
మ్మొగమునం దనుకంప ♦ మొలకలెత్త
అశ్వజవహాయ ఖురో ♦ ద్ధతరజఃపటలసం
కలితమై బహుళమహా ♦ దలఁజలింప
విమతధాత్రీనాథ ♦ సమితి హృత్పంకేజ
ములహాసచంద్రిక ♦ ల్మొగుడఁజేయ

నిటలతటంబుపై ♦ నెలకొన్న శ్రమవారి
కణములం దిలకంబు ♦ కరఁగిజాఱ
తే॥ గీ॥ సరని యరదంబు నొగనుండి ♦ మురువుతోడ
ధర్మపుత్రున్మనోము నీ ♦ తత్వమెంతు
మధుమదనిరాస కోటిమ ♦ న్మథవిలాస
శ్రితమనోవాస జయజయ ♦ శ్రీనివాస 71

సీ॥ మహితగోషంబుచే ♦ మామకు వశనివై
పురకాంతలకుఁ బంచ ♦ శరుఁడవగుచు
మనుజనాధులకెల్ల ♦ మండలేశ్వరుఁడవై
సురలకు విడరాని ♦ చుట్టమగుచు
కపటాత్మకులపాలఁ ♦ గాలపాశంబవై
వెట్టిగొల్లని కొక్క ♦ కుఱ్ఱవగుచు
పసులకాపరులకుఁ ♦ బరమహితుండవై
కమలజభవసృష్టి ♦ కర్తవగుచు
తే॥ గీ॥ జారచోరులలో సర ♦ దారువయ్యు
నిగమశిరములపై నెక్కి ♦ నిలిచితికద
మధుమదనిరాస కోటిమ ♦ న్మథవిలాస
శ్రితమనోవాస జయజయ ♦ శ్రీనివాస 72

సీ॥ నీభయంబునఁగాదె ♦ నిచ్చలు పవనుండు
వివిధగతులనొంది ♦ వీచుచుండె
నీభయంబునఁగాదె ♦ నీరేజబాంధవుం
డుదయించుచుండెఁ గా ♦ లోచితముగ

నీభయంకరంబునఁగాదె ♦ నిరత మింద్రుఁడు నగ్ని
మెలఁగుచుండిరి తమ ♦ మెలపులందు
నీభయంబునఁగాదె ♦ నిల్వఁదీరక మృత్యు
వఖిలజీవుల వెంట ♦ నరుగుచుండె
తే॥ గీ॥ ఎంతవాఁడవో నీవు వా ♦ రింతవడఁగ
నేలొకో మాకు నెఱుఁగంగ ♦ నెంతదవ్వ
మధుమదనిరాస కోటిమ ♦ న్మథవిలాస
శ్రితమనోవాస జయజయ ♦ శ్రీనివాస 73

సీ॥ వేణుగానసుధాబ్ధి ♦ వీచీసముద్వేగ
మీలితనేత్రాబ్జ ♦ లీలతోడ
జితసవ్యదర్పణ ♦ ద్యుతి కపోలయుగంబు
పైఁ జలత్కుండల ♦ ప్రభలతోడ
శరదిందుబింబ సుం ♦ దరమైనమోముపై
నటదసితాలక ♦ పటలితోడ
ప్రావృట్పయోద గ ♦ ర్భస్ఫురచ్ఛంపాల
తా సువర్ణాంబర ♦ ద్వయముతోడ
తే॥ గీ॥ దివ్య మందారమాలికా ♦ దీప్తితోడ
నెదుట సాక్షాత్కరించి వ ♦ న్నేలు మిపుడు
మధుమదనిరాస కోటిమ ♦ న్మథవిలాస
శ్రితమనోవాస జయజయ ♦ శ్రీనివాస 74

సీ॥ పతిసేవ విడనాడి ♦ యతనుదాడికినోడి
సుదతులు నినుఁగూడి ♦ చుట్టికొల్వ

ఃజవత్సములఁ బాసి ♦ నమరు వేయఁగ రోసి
గోపులుఁ గనుఁ డాసి ♦ గుములుఁ గూడ
వాలంబులను దాఁచి ♦ లీల నీదిశఁ జూచి
సర్పముద్ధలలఁ బూఁచి ♦ సంతసిల్ల
గఁగఁ శోషణముఁ దీరి ♦ పరభృతంబులఁ జీరి
విటపముల్డమువారి ♦ వెక్కరించ

తే॥ గీ॥ మురళి మ్రోయించునపుడు ♦ విన్నరసిచూచి
నతులొనర్చినవారి సు ♦ కృతమదెంతొ
మధుమదనరాస కోటిమ ♦ న్మథవిలాస
శ్రితమనోవాస జయజయ ♦ శ్రీనివాస 75

సీ॥ వాత్సల్య మభయదా ♦ నాత్మసఖ్య మూర్తిసం
హారణంబు నౌదార్య ♦ మ ఘువిశోష
ణంబున పరిగణి ♦ తంబైన శ్రేయఃప
దప్రాపణంబును ♦ సుప్రసిద్ధి
నొందె నీయందుంట ♦ నుత్తమగుణ సర్వ
భువనసేవ్యుఁడవొక్కఁ ♦ డవయటంచుఁ
ప్రహ్లాద దశకంఠ ♦ రభ్రాత లిభరాజ
ద్రౌపది గౌతము ♦ ధర్మపత్ని

తే॥ గీ॥ ధ్రువుఁడు వరుసగ నీ యాజ్ఞ ♦ ఘను గడంగి
సాత్యవిచ్చుచునుండి రై ♦ శ్వర్య మునఁగ
మధుమదనరాస కోటిమ ♦ న్మథవిలాస
శ్రితమనోవాస జయజయ ♦ శ్రీనివాస 76

సీ॥ ఈశ్వరుఁడా విష్ణు ♦ వెల్లదేశములందు
నిత్యస్థితుండౌట ♦ సత్యమేని
ఈ యుక్కుకంబమం ♦ దిపుడుచూపు దురాత్మ!
యని హిరణ్యకుఁడాత్మ ♦ తనయుతోడ
గద్దించిపల్కన ♦ క్కంబమునందుండి
వెలువడి నఖముఖం ♦ బులఁ దదీయ
వక్షమ్ముఁజీల్చి ని ♦ ర్వక్ర విక్రముఁడవై
భక్తవాత్సల్యంబు ♦ బయలుపఱచి
తే॥ గీ॥ నట్టి జగదార్తిభార సం ♦ హారణశీల
మున విరాజిల్లు నీవె మా ♦ మూలధనము
మధుమదనిరాస కోటిమ ♦ న్మథవిలాస
శ్రితమనోవాస జయజయ ♦ శ్రీనివాస 77

సీ॥ అనఘాత్ముఁ డావిభీ ♦ షణుఁడు రాక్షసభయం
బున శరణార్థియై ♦ వనధిదాటి
వచ్చి నిలిచియుండె ♦ వానరాధిప తోడి
తెమ్మనాగడకభ ♦ యమ్మొసంగి
వాఁడ నీతనిగాదు ♦ వేడినచో దశ
కంధరుడైనను ♦ గాతునిదియె
నాప్రతిజ్ఞయటంచు ♦ పలికినాప్తసుతునితోఁ
బల్కి విభీషణు ♦ భయముఁదీర్చి
తే॥ గీ॥ సోదరప్రేమ నెఱపిన ♦ నీ దయామృ
తమ్ము మమ్మేలుఁగాక సం ♦ తతము శౌరి

మధుసూదనవిరాస కోటిమ ♦ న్మథవిలాస
శ్రితమనోవాస జయజయ ♦ శ్రీనివాస 78

సీ॥ మాతంగయూథాధి ♦ నేత గ్రాహగ్రస్త
చరణుఁడై వేయివ ♦ త్సరములఖిల
లోకాధినాథుఁడ ♦ ప్రాకృత దివ్యస
న్మంగళాంగుఁడు విశ్వ ♦ మయుఁడనంతుఁ
డా మహామహుని నే ♦ నర్థింతు నాపదు
ద్ధరణార్థమోయంచుఁ ♦ గరము సాచి
యాక్రందనము సేయ ♦ నబ్జభవాదులు
విశ్వమయత లేమి ♦ విని యమూర

తే॥ గీ॥ కుయ్య నక్రముఁ దున్మి యా ♦ పన్నమైన
గజము నేలినస్వామి మా ♦ కు జయమిమ్ము
మధుసూదనవిరాస కోటిమ ♦ న్మథవిలాస
శ్రితమనోవాస జయజయ ♦ శ్రీనివాస 79

సీ॥ కతులెవ్వరిటు దైవ ♦ గతిఁదప్పి నిలిచిరి
గురుభీష్మకృపులైనఁ ♦ గూడ దనరు
ఉచ్ఛృంఖలత్వంబు ♦ నొంది రారాజప్డు
మానభంగము సేయఁ ♦ బూనియుండె
కటకటా యాకష్ట ♦ మెటులసైతునో శౌరి
శంఖచక్రగదాసి ♦ శార్ఙహస్త
పాండునందన బహిః ♦ ప్రాణదయామయ
దేవమానవయను ♦ దీనఁగృష్ణ

తే॥ గీ॥ నక్షయాంబరవృతఁ జేసి ♦ యపుడె ప్రోచి
నట్టి నిన్నెంతు సంతసం ♦ గాంతరమున
మధుసూదనవిరాస కోటిమ ♦ న్మథవిలాస
శ్రితమనోవాస జయజయ ♦ శ్రీనివాస 80

సీ॥ ఎవని శ్రీపాదాబ్జ ♦ భవశివ్యత్తోయముల్
తతజగత్పాప వి ♦ ధ్వంసకములొ
ఎవనినామామృతం ♦ బఖిలసంసార
సంతాపదావాగ్ని ♦ శాంతికరము
ఎవనిపాదపరాగ ♦ మవని గౌతమమహా
ముని సతీశాపవి ♦ ముక్తిదంబో
ఎవనిచారిత్రము ♦ ల్ప్రివిమలమానస
పూతమశ్రోత్ర వి ♦ భూషణములో

తే॥ గీ॥ అట్టిదేవాధిదేవుఁడ ♦ వైన నీవు
గాక మాకింక నెవరైనఁ ♦ గలరెదిక్కు
మధుసూదనిరాస కోటిమ ♦ న్మథవిలాస
శ్రితమనోవాస జయజయ ♦ శ్రీనివాస 81

సీ॥ సవతితల్లి కొమరు ♦ సక్షిపై నిడికొన్న
తండ్రిఁగాంచి ధ్రువుఁడు ♦ తానుగూడ
తత్సమానపదవి ♦ నుత్సహించుచువచ్చి
ధాత్రీతిరస్కార ♦ దైన్యమొంది
వనసీమ కేగి చ ♦ య్యాన దేవమునినాథు
నుపదేశంబుచే ♦ స్వామి నిన్ను

మానసంబుననిల్పి ♦ మహితతపోవ్రతా
చరణుఁడై మెప్పింపఁ ♦ గరుణ నతని
తే॥ గీ॥ కభిమతంబులఁ గృపసేయు ♦ నపు డొపఁగవె
శాశ్వతపదంబుఁ గాదనఁ ♦ జాలె నెవఁడు
మధుసుదనిరాస కోటిమ ♦ న్మథవిలాస
శ్రితమనోవాస జయజయ ♦ శ్రీనివాస 82

సీ॥ స్వస్వాధికార ని ♦ ర్వహణ ధూర్వహులౌచు
విధిలేక శక్రాది ♦ విబుధులెల్ల
త్రిదివమునందుండి ♦ హృదయాంబుజాతంబు
లుత్కటభక్తిచే ♦ నుల్లసిల్ల
త్వద్గోపురాగ్ర సం ♦ దర్శనజనిత హ
ర్షాంబుపూరితనేత్రు ♦ లౌచు నొల్ల
కాత్మీయదేవత్వ ♦ మహరహంబును దావ
కారాధనామృతధారఁ ♦ గొల్ల
తే॥ గీ॥ గొనఁగ మానవులై పుట్టఁ ♦ గోరుదురట
నీవిలాసాచలంబుపై ♦ ధీవిలాస
మధుమదనిరాస కోటిమ ♦ న్మథవిలాస
శ్రితమనోవాస జయజయ ♦ శ్రీనివాస 83

సీ॥ అవనివాసిష్ఠకృ ♦ ష్ణార్యుండనెడి గర్భ
వైష్ణవోత్తముఁడ్రమోల ♦ వచ్చినిల్చి
పంచవార్షికవయః ♦ పరిమాణ బాలుండ
వై విపంచీనినా ♦ దామృతాబ్ధిఁ

దేలి శాల్గజ్జెలం ♦ దియలు ఘల్ఘల్లని
మ్రోయ మైమఱపుతో ♦ ముద్దులొల్క
భరతశాస్త్రవిశేష ♦ పద్ధతిఁ గిటతక
తధికిణతోమని ♦ తాండవంబు

తే॥ గీ॥ సల్పినావట సింహాద్రి ♦ సదనమందు
సతతమాధన్యుమీఁది వి ♦ శ్వాసమెంతొ
మధుమదనిరాస కోటిమ ♦ న్మథవిలాస
శ్రితమనోవాస జయజయ ♦ శ్రీనివాస 84

సీ॥ వేదశాస్త్రపురాణ ♦ వివిధస్మృతీతిహా
సములందు మిగుల వి ♦ శ్వాసమూని
సవనంబులఁ బశువి ♦ శసనము ల్సేసితి
నిందిరాపతి ప్రీతిఁ ♦ జెందుననుచు
నిది యథార్థంబైన ♦ మది లేదు సంశయం
బటుగానిచో మహా ♦ చటుల ఘోర
పాపాగ్నికీలల ♦ పాలుగాకుందునే
యనివాజపేయది ♦ వ్యాధ్వరమున
శ్రీగర్భవైష్ణవ ♦ శేఖరుండౌ నర
సింహార్యుఁడెడనెడఁ ♦ జిత్తమందు
బహువిచారంబూని ♦ పలుతెఱంగులనుండఁ
దత్సంశయాపనో ♦ దంబుసేయ
నంతరంబున నెంచి ♦ సంతసంబునఁ గేలి
కీలాంతరంబునం ♦ దోలినిల్చి

వపభుజించుచు రమా ♦ వనితాలలామతో
భక్తవాల్లభ్యంబు ♦ బయలుపఱచి
తే॥ గీ॥ సేవసాయించినట్టి మీ ♦ చిత్తవృత్తి
యెంతకరుణార్ద్రమైనదో ♦ యెవనికెఱుక
మధుసుదనిరాస కోటిమ ♦ న్మథవిలాస
శ్రితమనోవాస జయజయ ♦ శ్రీనివాస 85

సీ॥ ఉత్కటప్రేమచే ♦ నుభయవిభూత్యధీ
శ్వరునొనర్చితి వొక్క ♦ సమయమందు
భాష్యము రచియించి ♦ పరవాదుల జయించు
చుమియుంటి వీ వొకట ♦ సమయమందు
మాకు నమ్మికమైన ♦ మంత్రివంచని మైత్రి
సల్పితి వేఱొక్క ♦ సమయమందు
అస్మజ్జయధ్వజం ♦ బగుమని శ్రీసూక్తి
సాయించినావొక్క ♦ సమయమందు
తే॥ గీ॥ సకలవిధములవిట్లు మీ ♦ సమయమెనయ
నుడయవరులెంత ధన్యులో ♦ నుడువఁదరమె
మధుమదనిరాస కోటిమ ♦ న్మథవిలాస
శ్రితమనోవాస జయజయ ♦ శ్రీనివాస 86

సీ॥ పరరాజకన్యకా ♦ పల్యంకతలముపై
నిను బేదపెన్నిధిఁ ♦ గనినరీతిఁ
గని రమ్ము మాతండ్రి! ♦ యనిపిల్వ పంచవా
ర్షికవయఃపూర్ణ బా ♦ లకుఁడవౌచు

గజ్జెలకడియము ♦ ఘల్లుఘల్లనుచు మ్రోయ
కౌస్తుభదీప్తులా ♦ కసమునిండఁ
గనకచేలద్యుతు ♦ ల్కనులకు భ్రమఁగొల్ప
నుదుటకస్తురిబొట్టు ♦ ముదమెలర్ప
చంగున దక్షిణో ♦ త్సంగపీఠివసింప
గారవంబున నిన్నుఁ ♦ గౌఁగిలించి
శిరమువూర్కొని ముద్దు ♦ సేయుచుఁ జుబుకంబుఁ
బుణికి చెక్కిలిదువ్వ ♦ ఘనముదశ్రు
కణపూరితాక్షుఁడై ♦ కన్నతండ్రీ యదు
గిరిచిన్నఁబోయె నీ ♦ విరహమునను
నమ్మరామప్రియా ♦ నమ్మ నాకల్క నీ
పిన్నతనమ్మచేఁ ♦ బేరుసెడదె
యదుగిరీశ్వరినిచ్చి ♦ ముదమొప్పఁ బాణిగ్ర
హణమొనర్చెదఁ బెద్ద ♦ తనము నేర్చి
రమ్మ సంపత్కుమా ♦ రయటంచు నినుజీరి
బుజ్జగించుచు మేనఁ ♦ బులకలెగయ
నానందసాగర ♦ మందు నోలాడి నీ
యాజ్ఞనాదలఁదాల్చి ♦ యాదవాద్రి
మౌళిఁజేరిచి భవ ♦ న్మహిమముఁ బల్మారు
సకలదిక్కులలోనఁ ♦ జాటిచెప్పి
తే॥ గీ॥ నట్టి యతిపతి సౌభాగ్య ♦ మెట్టిదనుచుఁ
జెప్ప నెవరైన నిల సాహ ♦ సించఁగలరె

మధుమదనిరాస కోటిమ ♦ న్మథవిలాస
శ్రితమనోవాస జయజయ ♦ శ్రీనివాస 87

సీ॥ సత్యవ్రతుని హస్త ♦ జలములం దుదయించి
తృణముగ నొకరీతిఁ ♦ దనువుఁ బెంచి
రాజీవగర్భుని ♦ ర్భరనుతు లాలించి
లోకపావనమొనర్ప ♦ లోఁదలంచి
అతిపృథుమకరాల ♦ యమునం బ్రవేశించి
శాత్రవుల్ధృతిఁదూల ♦ సంచరించి
అందుదాఁగిన సోమ ♦ కాసురు వధియించి
యామ్నాయములనెల్ల ♦ నాహరించి
తే॥ గీ॥ బుధులు గొనియాడఁ గౌతుకం ♦ బునవిరించి
కప్పుడందిచె నీవు మ ♦ త్స్యతవహించి
మధుమదనిరాస కోటిమ ♦ న్మథవిలాస
శ్రితమనోవాస జయజయ ♦ శ్రీనివాస 88

సీ॥ ఆజన్మవైరంబు ♦ లడుగంట విడఁగొట్టి
బర్హిర్ముఖాసురు ♦ ల్పట్టుఁబట్టి
మందరంబును వాల ♦ సందరంబునఁ బెట్టి
వాసుకిం దన్నితం ♦ బమునఁగట్టి
చెటిరొకవైపునం ♦ జేరి చేతులఁజుట్టి
మునుమిడి మధియింప ♦ మునుగునట్టి
గిరిఁగాంచి వరుస నం ♦ దఱు నంజలులఁబట్టి
మొఱలిడ నిను మనం ♦ బులనుముట్టి

తే॥ గీ॥ పరమకృపచేతఁ గూర్మరూ ♦ పమునఁ బుట్టి
తాలిచితి వద్రిఁగలఁడౌని ♦ నొప్పులు బెట్ట
మధుమదనిరాస కోటిమ ♦ న్మథవిలాస
శ్రితమనోవాస జయజయ ♦ శ్రీనివాస 89

సీ॥ నీలాబ్జదళకాంతిఁ ♦ గేలిసేసెడు మేని
పై స్వర్ణచేలము ♦ ల్యాభసిలంగ
ఫలవద్దామధ సుధా ♦ కలశ రథాంగ శం
ఖముల రాజిలఁ జతు ♦ ష్కరములందు
మకుట కేయూర హా ♦ ర కదంబ నిష్ప్యూత
నిరత రత్నప్రభ ♦ ల్నింగినిండ
శారద రాకాని ♦ శాకరు వెలివెట్టు
ముఖమునం బుండ్రంబు ♦ ముద్దులొల్క

తే॥ గీ॥ నబ్ధి ధన్వంతరి సమాఖ్య ♦ నవతరించి
వైద్యశాస్త్రప్రవక్తవై ♦ వఱలితహహ
మధుమదనిరాస కోటిమ ♦ న్మథవిలాస
శ్రితమనోవాస జయజయ ♦ శ్రీనివాస 90

సీ॥ జాళువాబంగారు ♦ సరిగ కుచ్చెలలపై
నఖరాంశువుల్గాడి ♦ నాట్యమాడ
జిగిమించు చిఱుతొడల్ ♦ స్వీయకాంతులనింపి
రహిఁ జెల్గుపావడ ♦ రంగుమార్ప
పైఠాణిరవిక లో ♦ పలఁగులుకు గుబ్బచ
న్గవఁగాంచి మునివరు ♦ ల్గలతఁజెంద

మాటిమాటికిఁ గ్రుంగు ♦ గాటపుటా కటికటి
చలనంబు సురతతి ♦ శక్తినొంప

తే॥ గీ॥ భ్రూవిలాసంబు లంగజు ♦ న్నుజ్జగించ
నమృతమును బంచ మోహిని ♦ వైతి వార !
మధుమదనిరాస కోటిమ ♦ న్మథవిలాస
శ్రితమనోవాస జయజయ ♦ శ్రీనివాస 91

సీ॥ జక్కవకవ సరిగ ♦ నిక్కలంబుగాఁ గేరు
గబ్బిగుబ్బల సొరుఁ ♦ గాంచునొకఁడు
పచ్చవిల్తునివాలు ♦ మచ్చరంబునఁ దోలు
మైఁ దీఁగపైఁ దాలు ♦ మలయునొకఁడు
ముకురాలఁ గలపెంపు ♦ మొనసి పైకొనిత్రెంపు
తళుకుఁ జెక్కుల సొంపుఁ ♦ దలఁచునొకఁడు
కలహంసములకూఁతఁ ♦ దలఁకించఁ గల లేఁత
గిలుకుమెట్టెల మ్రోఁత ♦ కులుకు నొకఁడు

తే॥ గీ॥ ఇటులఁ జటులాత్ములైరి సుర ♦ ల్పటిమఁ దూల
మోటు రక్కసిగుంపుల ♦ మాటలేల
మధుమదనిరాస కోటిమ ♦ న్మథవిలాస
శ్రితమనోవాస జయజయ ♦ శ్రీనివాస 92

సీ॥ పయ్యెదజారించి ♦ పల్లంటఁ గమ్మోవి
నొక్క సిగ్గిలి దైత్యు ♦ లుక్కుసెడఁగ
చక్కఁగూర్చుండుఁడీ ♦ చను దెంతునని కన్ను
లల్లార్చి యసురులు ♦ ల్లములఁ బొగడ

బావమఱందుల ♦ బ్వావుల మధువోల్కఁ
బల్కి దనుజాలమేనఁ ♦ బుల్కలెగయ
కబరీభరంబుపైఁ ♦ గ్రాలు శోంట్లందోలి
రాత్రించరులకుఁ బే ♦ రాసఁగూర్చి
తే॥ గీ॥ సురలకమృతమ్ము వోసి యా ♦ సురులనోటఁ
దాల్చికొట్టితి దుమ్ము నీ ♦ తత్వమేమి
మధుమదవిరాస కోటిమ ♦ స్మథవిలాస
శ్రితమనోవాస జయజయ ♦ శ్రీనివాస 93

సీ॥ భావికాలవిశేష ♦ పరిశీలనము లేక
మనసు ధర్మంబుపై ♦ మసలనీక
తనకృత్యమును మెచ్చ ♦ దైత్యవరా నీక
మవని రసాతలం ♦ బంట నీకఁ
ద్రోయ హేమాక్షు న ♦ ద్భుతలీలఁ బోనీక
కిటిరూపమునఁ ద్రుంచి ♦ పటిమ వోక
దంష్ట్రాగ్రమున నిల్పి ♦ ధరనవమతిఁ దేక
ప్రీతి లోకములు భ ♦ రింపరాక
తే॥ గీ॥ మెలఁగునట్టులఁ జేసితి ♦ మిన్ను వాఁక
తాల్పనకలేదు నీ స్వతం ♦ త్రంపుఁబోక
మధుమదనిరాస కోటిమ ♦ న్మథవిలాస
శ్రితమనోవాస జయజయ ♦ శ్రీనివాస 94

సీ॥ ఘనసటావిక్షేప ♦ మున వియత్తల చల
జ్జీమూతసంఘము ♦ ల్చెదరిపోలు

ఆస్యసంజాత రో ♦ షాగ్నికీలా మాలి
కలు పర్వ భూనభోం ♦ తరము నిండ
అతితర చటులాట్ట ♦ హాస నినాదము
లఖిలగిరి గహ్వరం ♦ బుల ధ్వనించ
ప్రళయకాలాశని ♦ వ్రాత పాత కఠోర
చరణఘట్టనల ది ♦ క్కరులు తూల
తే॥ గీ॥ మనుజసింహాంబవై పోరి ♦ కనకకశిపుఁ
ద్రుంచి ప్రహ్లాదు నిదఁ గృపఁ ♦ గాంచి తౌర!
మధుమదనిరాస కోటిమ ♦ న్మథవిలాస
శ్రితమనోవాస జయజయ ♦ శ్రీనివాస 95

సీ॥ లోకరక్షణ కార్య ♦ లోలమౌ దక్షిణ
కరతలంబునఁ గమం ♦ డలము మెఱయ
దక్షిణేతరమునం ♦ ధవళాతపత్ర పా
లాశదండద్యుతు ♦ ల్రహిఁ జెలంగ
రమణీయ యజ్ఞసూ ♦ త్రముఁగూడి పద్మాక్ష
మాలికశోభలం ♦ దేలియాడ
కటితటంబునఁ బీత ♦ కౌశేయముద్యద
ర్కసహస్ర కాంతిపై ♦ విసువుఁజూప
తే॥ గీ॥ నరిగి వంచించిబలిని ని ♦ ర్జరకులేంద్రు
నార్తిఁబాపిన వామన ♦ మూర్తివిగద
మధుమదనిరాస కోటిమ ♦ న్మథవిలాస
శ్రితమనోవాస జయజయ ♦ శ్రీనివాస 96

సీ॥ గతభవ సుకృత సం ♦ తతిఫలమున సురల్
రేణుకా జమదగ్ని ♦ మౌనివరుల
కన్నసుతుండవై ♦ యఖిల వేదాంత వి
ద్యారహస్యములెల్ల ♦ నధిగమించి
వల్కలాజిన జటా ♦ భారమూనియు ఖడ్గ
శర చాప ధరుఁడవై ♦ క్షాత్రమొంది
పటుతరాహంకార ♦ కుటిల చక్రాంశ సం
భవుఁ గార్తవీర్యు దు ♦ ర్భరశరాళి
తే॥ గీ॥ నొంచి బాహులు వేయి ఖం ♦ డించి మించి
ప్రతిన నెఱవేఱఁ జేసితో ♦ పరశురామ
మధుమదనిరాస కోటిమ ♦ న్మథవిలాస
శ్రితమనోవాస జయజయ ♦ శ్రీనివాస 97

సీ॥ బ్రహ్మాది దేవతా ♦ పటల యాచ్ఞాదైన్య
మును బోనడంప (శ్రీ) ♦ వనజబాంధ
వాన్వయంబున దశ ♦ స్యందనాత్మజుఁడవై
ధూర్జటి విల్దున్మి ♦ తోయజాక్షి
జానకిం గైకొని ♦ జగదపకారులౌ
ఖర దూషణాది రా ♦ క్షసులఁ ద్రుంచి
వనచరావళిఁగూడి ♦ వార్ధిబంధించివై
శ్రవణుఁ బుత్రామాత్య ♦ సకలబంధు
తే॥ గీ॥ యుతముగాఁ గూల్చి త్రిభువన ♦ హితము నెఱపి
రక్తి నేలితి జీవులఁ ♦ రామభద్ర

మధుమదనిరాస కోటిమ ♦ న్మథవిలాస
శ్రితమనోవాస జయజయ ♦ శ్రీనివాస 98

సీ॥ రైవతరాజాధి ♦ రాజకన్యాకామ
తనుజితేందు మృణాళ ♦ ధవళధామ
అతిదుష్ట ధేనుకా ♦ ఖ్యాక దైత్యవిరామ
రమణీయ సుగుణ వా ♦ రాసిసోమ
వినుత సత్యాచార ♦ ఘనవాహినీసీమ
నీరజరిపువంశ ♦ నృపలలామ
రోహిణీ హృదయ న ♦ రోజ నిత్యక్షేమ
హత పాపనికర క ♦ ల్యాణనామ

తే॥ గీ॥ అభవ నిన్నేడి మేమెటు ♦ లైనఁబోము
పరమకృపఁ గాంచు మము బల ♦ భద్రరామ
మధుమదనిరాస కోటిమ ♦ న్మథవిలాస
శ్రితమనోవాస జయజయ ♦ శ్రీనివాస 99

సీ॥ కమనీయ శంఖ చ ♦ క్ర గదాసి శార్ఙ్గ కీ
లిత చతుర్బాహు సం ♦ భృతుఁడవౌచు
మంజుల కోటీర ♦ మహిత కౌస్తుభరత్న
హారాంగదాది భూ ♦ షాళితోడ
నుదయించి వసుదేవు ♦ సుదతియౌ దేవకీ
సతికి మాయామాను ♦ షత్వమొంది
వర్ధిల్లి వ్రేపల్లె ♦ వాడ నందునియింటఁ
గంసాది దుష్టరా ♦ క్షసులఁ గూల్చి

తే॥ గీ॥ నిరపి పార్థునితో మైత్రి ♦ నిఖిలలోక
పాలనముఁ జేసితౌర గో ♦ పాలకృష్ణ
మధుమదనిరాస కోటిమ ♦ న్మథవిలాస
శ్రితమనోవాస జయజయ ♦ శ్రీనివాస 100

సీ॥ నిగమచోదితకర్మ ♦ నిష్ఠాగరిష్ఠులౌ
నసురు లాత్మతపోబ ♦ లార్జితములు
వివిధదేవాలత్య ♦ వేగవంతములగు
రజతతామ్రమయాపు ♦ రములచేత
నఖిలలోకంబుల ♦ కహరహంబతితర
వ్యథఁగూర్చుచుండఁద ♦ న్నిధనమునకుఁ
గీలెఱుంగుచు జిన ♦ బాలుండవై పుట్టి
యాకధర్మ్యములెల్ల ♦ నరసిచెప్పి
తే॥ గీ॥ వేదబాహ్యులఁజేసి దు ♦ ర్భేద్యులైన
బుధవిరోధులఁ గూల్చితో ♦ బుద్ధరూప
మధుమదనిరాస కోటిమ ♦ న్మథవిలాస
శ్రితమనోవాస జయజయ ♦ శ్రీనివాస 101

సీ॥ కలియుగాంతమున శ్రీ ♦ కలితమౌ శంబలాఖ్య
పురమునం బ్రాహ్మణ ♦ కులమునందు
నఖిలకళావిదుం ♦ డౌ వారిప్రతునకు
దేవప్రథయను స ♦ తీలలామ
యందు జన్మించి నీ ♦ వంది సర్వసుపర్వ
నతుంతులితజవో ♦ ద్ధతులుకల్గి

వినతాతనూజాంశ ♦ మునఁబుట్టి పెంపొందు
హయవతంసము నెక్కి ♦ హయలు మీఱ
తే॥ గీ॥ నయవిదూరుల నెల్ల నీ ♦ నందకమను
ఖడ్గమునఁ ద్రుంచనుంటివే ♦ కల్కిమూర్తి
మధుసుదనిరాస కోటిమ ♦ న్మథవిలాస
శ్రితమనోవాస జయజయ ♦ శ్రీనివాస 102

సీ॥ సర్వలోకవిశాల ♦ సౌభాగ్యధాత్రి శ్రీ
భార్గవినీయురో ♦ భాగమందు
బ్రహ్మహత్యాది దు ♦ ర్భగపాపపశ్యతో
హరసురాపగ భవ ♦ స్ఫురణమందు
సకల సృష్టివితాన ♦ సహజపాండిత్య వి
పుణుఁడబ్జయోని నీ ♦ బొజ్జయందు
నఖిల రక్షకశిక్ష ♦ ణాత్త వైభవ శంఖ
చక్రముల్ హస్తాంబు ♦ జంబులందుఁ
తే॥ గీ॥ గోరి వివసించ నట్టి నీ ♦ కొలువొందు
టరయ భైషజ్యమహా భవ ♦ హరణమందు
మధుమదనిరాస కోటిమ ♦ న్మథవిలాస
శ్రితమనోవాస జయజయ ♦ శ్రీనివాస 103

సీ॥ పరమ భాగవతోత్త ♦ ముల నిరసించి త్వ
త్ప్రతిమలఁగని నంత ♦ తము హసించి
పరదారలందాత్మఁ ♦ దిరము గునటుఁజేసి
నిగమార్థముల నెల్ల ♦ నీటఁగల్పి

సజ్జనావళి కాత్మ ♦ సంతోషముం గూర్చి
మధుసేవయుం దెప్పు ♦ మనసుఁ జేర్చి
మైత్రితోఁ దసుర ♦ మండలముం గూడి
యాచార ధర్మంబు ♦ లసలె వీడి
తే॥ గీ॥ మేరమీఱిన యయ్యజా ♦ మిఁళు మనిచితి
నన్నుఁ గృపఁ జూడ భరమయ్యె ♦ నా మహాత్మ
మధుమదనిరాస కోటిమ ♦ న్మథవిలాస
శ్రితమనోవాస జయజయ ♦ శ్రీనివాస 104

సీ॥ హృదయంగమంబౌచుఁ ♦ దుదముట్టునట్టి ల
క్ష్మీ రసోల్లసిత భా ♦ షితము వీడి
అంజలిబద్ధులై ♦ యభినుతించుచునున్న
విధి వామదేవుల ♦ న్వీడనాడి
నిరత కింకరభావ ♦ నిష్ఠుఁడౌ నహిరాజు
పైనుండిదిగి ప్రేమ ♦ భరముఁ గూడి
సనకాది యోగి హృ ♦ త్సరసిజస్థితికి ను
ద్వాసప్రబంధము ♦ ల్దజిమిపాడి
తే॥ గీ॥ అరిగి దాసులనేలు నీ ♦ యఖిలసమయ
ముల నవాజ్ఞాతు మామీఁద ♦ వలదు పేటు
మధుమదనిరాస కోటిమ ♦ న్మథవిలాస
శ్రితమనోవాస జయజయ ♦ శ్రీనివాస 105

సీ॥ నాథయామున విప్ర ♦ నారాయణులమీఁదఁ
గలకృపామృతవింత ♦ [illegible]

శ్రీపరాంకుశవిష్ణు ♦ చిత్తకూరేశులం
జూచినచూడ్కి నగ ♦ జూడరాదె
ధరణిఁగాసారభూ ♦ తభ్రాంతయోగుల
నరసినరీతి న ♦ న్నరయరాదె
పరకాలతిరుపాణి ♦ కులశేఖరులయెడ
నుంచినదయఁగొంత ♦ పంచరాదె
తే॥ గీ॥ బుద్ధితెలిసినదాది యీ ♦ పూటవఱకు
వేఁడుకొనుచుండునడియేని ♦ తోడవాదె
మధుమదనిరాస కోటిమ ♦ న్మథవిలాస
శ్రితమనోవాస జయజయ ♦ శ్రీనివాస 106

సీ॥ సర్వతంత్రంబులం ♦ జాలిన గ్రంథము
ల్వీరచింపఁబూనిన ♦ వేళలందు
కడుబీద కైశ్వర్య ♦ మిడనెంచి మనమునఁ
దీక్షవహించిన ♦ దినమునందు
ప్రతివాదిజనవచో ♦ ద్ధతినదల్చుచు దిగ్వి
జయలక్ష్మిఁ గైకొన్న ♦ సమయమందు
కోలాహలునిశక్తిఁ ♦ దూలించి బహువిధ
లీలలంబ్రకటించు ♦ కాలమందు
తే॥ గీ॥ నేనె నీవని పలుకుచు ♦ నిగమశేఖ
రాఢ్యపై నిల్పినట్టిద ♦ యంగనఁగదె
మధుమదనిరాస కోటిమ ♦ న్మథవిలాస
శ్రితమనోవాస జయజయ ♦ శ్రీనివాస 107

సీ॥ పాషాణముం బాద ♦ కంకేజరజముచేఁ
ప్రమదఁగాఁ జేసిన ♦ ప్రభుఁడవీవు
త్రయికినపఖ్యాతి ♦ దలఁగ రాలను సాగ
రంబునందేల్చిన ♦ రాజవీవు
గోపాలకానీక ♦ గోవత్సరూపముల్
గొని వినోదించిన ♦ ఘనుఁడవీవు
ఎన్నఁడో మృతినొంది ♦ యున్న పుత్త్రులఁదెచ్చి
ద్విజునకిచ్చిన మహా ♦ విజయివీవు

తే॥ గీ॥ అట్టి నీకెంతటివని మాదీ ♦ యాంతరంగ
తాపములవార్చి దరిఁజేర్చ ♦ తగభరింప
మధుమదనిరాస కోటిమ ♦ న్మథవిలాస
శ్రితమనోవాస జయజయ ♦ శ్రీనివాస 108

సీ॥ అఖిలలోకైక మో ♦ హనశీలమౌ కాంతి
తనువుపైఁ జెలరేఁగి ♦ తాండవింప
ప్రత్యూష సూర్యప్ర ♦ భాపంక్తిఁ దలఁకించు
హారంబట్టు కాల్వపై ♦ హాయులు మీఱ
ఆలోల నీలాల ♦ కాంతరంబున ముఖాం
భోరుహద్యుతు లంబు ♦ జారిఁగెల్వ
ఘనసార కస్తూరి ♦ కా మిళచ్చందన
సార సౌరభము విం ♦ డారఁబర్వ

తే॥ గీ॥ వృషభ గజ సింహ గతులతో ♦ వేదవేద్య
రమ్మ మాయింటికిపుడు భ ♦ ద్రమ్ములిమ్మ

మధుసూదనిరాస కోటీసు ♦ న్మథవిలాస
శ్రితమనోవాస జయజయ ♦ శ్రీనివాస 109

సీ॥ చక్రి నీసాన్నిధ్య ♦ సౌఖ్యమబ్బిన నేను
వైరులధాటికై ♦ వగవ నేల
ప్రహ్లాదనుత భవ ♦ ద్భజనమబ్బిన నేను
భూతవైద్యులకునై ♦ పోవ నేల
శ్రీశ యుష్మద్ధ్యాన ♦ లేశమబ్బిన నేను
సిరులకై యొకని యూ ♦ చింత నేల
శౌరి నీ కైంకర్య ♦ సారమబ్బిన నేను
మనుజుల కొలువుకై ♦ మసల నేల

తే॥ గీ॥ నీ సమర్చనమబ్బిన ♦ నేద్విరేఫ
వర్ణ! వైద్యులచే వెత ♦ ల్వడఁగ నేల
మధుమదనిరాస కోటిమ ♦ న్మథవిలాస
శ్రితమనోవాస జయజయ ♦ శ్రీనివాస 110

సీ॥ దాసజనాపాయ ♦ దర్వీకరావళి
గారుడమణివహా ♦ నీరజాక్ష
చకిత గోపీనేత్ర ♦ చాతక సంఘాత
జలధరమణివహా ♦ కలుషహరణ
భైష్మీ కుచద్వంద్వ ♦ భాసమానైక వి
భూషామణివహా ము ♦ ముక్షువినుత
సకలలోకవిశాల ♦ సౌందర్యసముదయ
ముద్రామణివహా స ♦ ముద్రశయన

తే॥ గీ॥ దేవకులమౌళిమణివహో ♦ దీనబంధు
కమ్మ రత్నామణివి మాకు ♦ సమ్మదమున
మధుమదనిరాస కోటిమ ♦ న్మథవిలాస
శ్రితమనోవాస జయజయ♦ శ్రీనివాస 111

సీ॥ ప్రాకులలోఁజేవ ♦ మాడ్కి శిలాతతు
లందు వెగ్గొందు లో ♦ హంబుకీతి
లోకంబులో జీవ ♦ లోకంబులోనుండి
యెందుఁగానంబడ ♦ కెల్ల వేళ
లనలముతరువునం ♦ దావిర్భవంబందు
తెరఁగునదధినుండి ♦ కలఁగుఘృతము
కరణిమానసములో ♦ నరయఁగ మౌనీంద్రు
లకుఁ బొడసూపుదు ♦ వ కుటిలాత్మ

తే॥ గీ॥ అట్టి నిన్నిట్టు దర్శన ♦ ధ్యానయోగ
శూన్యచిత్తుండ నేనెట్లు ♦ చూతునకట
మధుమదనిరాస కోటిమ ♦ న్మథవిలాస
శ్రితమనోవాస జయజయ♦ శ్రీనివాస 112

సీ॥ నిరతము నీపాద ♦ నీరేజయుగము నే
గుఱిఁజేసి మనమునం ♦ గొల్వనైతి
శ్రీతులసీదళాం ♦ చిత పుష్పమాలికా
తతి నినుఁ బూజింపఁ ♦ దలఁచనైతి
భవదాలయముఁజేరి ♦ భక్తితోఁ జల్మాఱు
సాఁగిలఁబడిమ్రొక్కఁ ♦ జాలనైతి

త్వద్దివ్యవిభవాప ♦ తారకథాసుధా
సారము నొకయింతఁ ♦ గ్రోలనైతి
తే॥ గీ॥ కుటిలకర్ముని నన్ను నీ ♦ వెటుల చేరఁ
దీసి పాలింతువో స్వామి ♦ తెలియదేమి
మధుమదనిరాస కోటిమ ♦ న్మథవిలాస
శ్రితమనోవాస జయజయ ♦ శ్రీనివాస 113

సీ॥ వితతధర్మాధర్మ ♦ విజ్ఞానశూన్యుఁడం
చని నన్ను విడకో ♦ వనజనాభ
లోభ మోహాది సం ♦ క్షోభితుం డితఁడంచుఁ
గినియకు ననుఁజూచి ♦ దనుజవైరి
వందనార్చన దాస్య ♦ భావ వర్జితుఁడు వీ
డని యుపేక్షింపకు ♦ కనకచేల
ద్వయ మంత్రతత్త్వ ని ♦ ర్ణయ విధురుండటం
చు నసూయఁ నొందకు ♦ ఘనఘనాంగ
తే॥ గీ॥ దోసఁగులన్నియు నేటితోఁ ♦ దొలఁగఁద్రోసి
వనటఁ గూర్పకు మీఁకను నీ ♦ వాఁడనైతి
మధుమదనిరాస కోటిమ ♦ న్మథవిలాస
శ్రితమనోవాస జయజయ ♦ శ్రీనివాస 114

సీ॥ నీరదాబ్జములపై ♦ నిచ్చలు మన్మనః
పుష్పంధయమునుంచఁ ♦ బూనుమయ్య
భవదీయ పాద స ♦ పర్యా నిరతులతోఁ
గామరొప్ప మైత్రిఁ జేఁ ♦ గూర్పుమయ్య

నిఖిలకాలములందు ♦ నిబిడమౌ సర్వభూ
తదయఁ బ్రసాదించి ♦ తనుపుమయ్య
కలనైన నన్మృతవా ♦ క్కులకు లోఁగాక మ
ద్రసన వర్తిలు మార్గ ♦ మొసఁగుమయ్య
తే॥ గీ॥ వెతకినను వాకు దిక్కు నీ ♦ వేగదయ్య
మామకీనాపరాధము ♦ ల్మఱచుమయ్య
మధుమదనిరాస కోటిను ♦ న్మఖవిలాస
శ్రితమనోవాస జయజయ ♦ శ్రీనివాస 115

సీ॥ అతివిచిత్రచ్ఛాయ ♦ లాకసంబును రాయఁ
గటితటంబున స్వర్ణ ♦ పటముఁ బూని
ప్రాగద్రిశిఖఁజేరు ♦ భానుబింబముఁ గేరు
మణికిరీటము శిరం ♦ బున ఘటించి
వజ్రచాపము బెట్టు ♦ వలదనిపోగొట్టు
భూషలు మేనిపైఁ ♦ బాదలఁజేసి
అన్యోన్య సౌభాగ్య ♦ జన్య గౌరవ లస
చ్ఛ్రీవత్స కౌస్తుభ ♦ శ్రీధరించి
తే॥ గీ॥ నీవు నాస్వప్నమునవిల్చి ♦ నిన్నరేయి
"ప్రాప్నుహీప్టాని" యంటివా ♦ ల్పరమపురుష
మధుమదనిరాస కోటిమ ♦ న్మఖవిలాస
శ్రితమనోవాస జయజయ ♦ శ్రీనివాస 116

సీ॥ దేహిమేసతతం త్వ ♦ దీయ పాదధ్యాన
తరణింభవార్ణవో ♦ త్తారణాయ

నిక్షిపమయి శ్రియం ♦ నితరాంహి యాచక
వార మనోరథ ♦ పూరణాయ
శక్తింప్రయచ్ఛమ ♦ త్వాంతస్థితేరద్య
వైరిమత్క ద్రోహ ♦ వారణాయ
తత్వంప్రసీద మే ♦ త్రయ్యాః పరంహ్యాది
త్వద్దివ్యరూప ని ♦ ర్ధారణాయ

తే॥ గీ॥ మమ భవభవాంతరాఘౌఘ ♦ మారణాయ
క్రూరతాంహర ద్రాగ్బుధ ♦ పారణాయ
మధుమదనిరాస కోటిమ ♦ న్మథవిలాస
శ్రితమనోవాస జయజయ ♦ శ్రీనివాస 117

సీ॥ శుభమంగళము భవ ♦ ద్విభవంబునకు శక్ర
కముఖోద్భవేశ్వరా ♦ ద్యమరవినుత
జయమంగళము భవ ♦ త్సదమలగుణరాశి
కనవరతంబు న ♦ వాంబుజాక్ష
సన్మంగళము భవ ♦ త్క్షపిత దానవచక్ర
చక్రాయుధమున క ♦ వక్రశౌర్య
ఘనమంగళము భవ ♦ ద్వనదనీలశరీర
కాంతికిఁ గరుణార ♦ సాంతరంగ

తే॥ గీ॥ నిత్యమంగళ మానంద ♦ నిలయమునకు
దివ్యమంగళ మభవ నీ ♦ దేవికెపుడు
మధుమదనిరాస కోటిమ ♦ న్మథవిలాస
శ్రితమనోవాస జయజయ ♦ శ్రీనివాస 118

సీ॥ ఆభీరసుదతి పా ♦ లారగించిననాటి
పన్నిన కౌతూహ ♦ లమ్ముతోడ

మహి సుదాముని పువ్వు ♦ మాలలందిననాటి
గురుకృపోదిత సమా ♦ దరముతోడ
అల కుచేలుని చేతి ♦ యటుకులు దినునాటి
సదములకరుణార ♦ సంబుతోడ
సరగున విదురునో ♦ గిరము సావడునాటి
నిరుపమ వాత్సల్య ♦ భరముతోడఁ
తే॥ గీ॥ గూడి యీశతకమ్మునఁ గై ♦ కొనుముతండ్రి
వచ్చిరానట్టి సుతుభావ ♦ మెచ్చునట్లు
మధుమదనిరాస కోటిమ ♦ న్మథవిలాస
శ్రితమనోవాస జయజయ ♦ శ్రీనివాస 119
సీ॥ వసుధ శ్రీమదగ్ఘర ♦ ద్వాజమాసింద్రగో
త్రార్ణవ పారిజా ♦ తద్రుమాయ
మానుఁడై బుధశీత ♦ భానుఁడై చెల్వొందు
శ్రీరామదేశిక ♦ శేఖరునకు
లలిత సద్గుణవల్లి ♦ లక్ష్మీనరసమాంబ
కును నేఁ దృతీయ సం ♦ దనుఁడ విఖన
సప్రోక్త సూత్రాను ♦ సరుఁడ రామానుజా
హ్వయుఁడ యుష్మత్పాద ♦ వనజరతుఁడ
తే॥ గీ॥ భక్తి నీశతకమ్ము నా ♦ శక్తి కొలఁది
కూర్చి యొసఁగితి దేవర ♦ గుణములెంచి
మధుమదనిరాస కోటిమ ♦ న్మథవిలాస
శ్రితమనోవాస జయజయ ♦ శ్రీనివాస 120


పరిసమాప్తము
శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

## —* తప్పొప్పుల పట్టిక. *—

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 2 | 9 | దీర్ఘ | దీర్ఘ |
| 3 | 17 | కోటిమ•మన్మ | కోటిమ•న్మ |
| 4 | 6 | కొంౘది | కొలఁది |
| 5 | 8 | ముఖరి | ముఖరి |
| 9 | 20 | నగరిని | నగరని |
| 14 | 10 | గిలి•ఫ్రూ | గించి•ఫ్రూ |
| 15 | 16 | తత్తు | తత్త్వ |
| 16 | 10 | నలకురే | నలయురే |
| 19 | 15 | తాలిక | లోకిక |
| 20 | 8 | నమంజే | నమూంజే |
| 21 | 19 | స్వాల్పఁ | స్వాల్పఁ |
| 22 | 18 | చుఁ•జైను | చుఁ•జైను |
| 24 | 5 | మద్దిద | మూద్దిద |
| ,, | 10 | ఖం•ఖండింప | ఖ•డింప |
| 32 | 10 | బఁడబై• | బండఁబై• |
| 35 | 8 | చోత్రజి | చోరజి |
| 39 | 1 | ముఁగొంగు | మూఁగొంగు |
| 42 | 20 | కఽవా | హఽవా |
| ,, | 21 | విమత | విమత |
| ,, | 22 | కలహ | ములహ |
| 44 | 21 | దాడికి | ధాటికి |
| 45 | 5 | ణముఁ | ణముఁ |
| 47 | 7 | మహాము | మహాము |
| ,, | 8 | గరము | గరము |
| ,, | 11 | క్రముఁదు | క్రమ్ముఁదు |
| 54 | 7 | రథాంగ | రథాంగ |
| 59 | 6 | రాసిసో | రాశిసో |
| 61 | 22 | మార్గ | మార్గ |
| 62 | 1 | సంతో | సంతో |
| 64 | 10 | దరిజే | దరిఁజే |
| ,, | 16 | కాల్వపై | కాల్వపై |